ర్వారమదీయబాహుపరి
వర్తితచండగదాభిఘాతభ
గ్నోరుతరోరుఁ జేయుదు సు
యోధను నుగ్రరణాంతరంబునన్ 44

వ. అని సర్వజనభయానక క్రోధావేశవివశుం డయి యాయు
ధంబు లున్నవలనికి దృష్టులు నలుపుచు నగ్రజు మొగంబు
సూచు చున్న భీమసేను నతిక్రూరాకారంబు సూచి భీష్మ
విదురద్రోణాదు లిది కోపంబున కవసరంబు గా దని
యాతనిం బ్రశాంతచిత్తుం జేసి రంత. 45

క. ధృతరాష్ట్రునగ్నిహోత్రా
యతనంబున నఱచె వఱళు లగ్నులు శాంత
ద్యుతు లయ్యెఁ గౌరవస్త్రీ
తతిహృదయము లధికశోకతప్తము లయ్యెన్ 46

క. క్రూరాత్మకులై దుష్పద
వీరతులగు ధార్తరాష్ట్రవీరుల శయ్యా
గారముల నెగసె నెంతయు
ఘోరంబుగఁ గాకఘూకఘూత్కారంబుల్. 47

క. అట్టిమహోత్పాతంబులు
పుట్టినఁ గృప విదుర కలశభూ శాంతనవుల్
నెట్టన ధృతరాష్ట్రజులకుఁ
బుట్టె నరిష్ట మని రిష్టకముచఁ దమలోనన్ 48

వ. అంతయు నెఱింగి గాంధారి విదురుం దోడ్కొని ధృత
రాష్ట్రు కడకుం బోయి పాండవపరాజయంబును ద్రౌపది

పరిభవంబును దుర్నిమిత్తోత్పత్తియుం జెప్పిన విని ధృతరా
ష్ట్రుండు దుర్యోధనుం బిలిచి యి ట్లనియె. 49

చ పరమపతివ్రతన్ సభఁ దప
స్విని బాండవధర్మపత్ని ధ
ర్మరత నయోనిజం బ్రకృతి
మానవభామినిఁ గాఁ దలంచి దె
ప్పరములు పల్కఁగాఁ దగునె
బాల్యమునాదిగ దుష్టభావనం
బెరిఁగితి నీనిమిత్తమునఁ
బెద్దయు దుఃఖితు లైరి పాండవుల్ 50

వ వారలవలన నీదురాగ్రహం బుడుగు మని కొడుకును భం
గించి సకల బాంధవహితంబు సేయం దలంచి ద్రౌపదిని
రావించి శాంతవచనంబుల ని ట్లనియె 51

## ధృతరాష్ట్రుఁడు ద్రౌపది గోరిన వరంబు లిచ్చుట

క. సుందరి ! నాకోడండ్రుర
యం దభ్యర్చితవు నీవ యతిముదమున నీ
కొందగఁ బ్రియంబు సేసెద
నిందుముఖి! వేఁడు మెద్ది యిష్టము నీకున్ 52

వ అనినం బాంచాలి యి ట్లనియె 53

ఆ కరుణతోడ నాకు వరము ప్రసాదింప
బుద్ధియేని లోకపూజితుండు

మనునిభుండు ధర్మికతనయుండు దాస్యంబు
వలనఁ బాయవలయు ౕ వసుమతీశ ! 54

వ అట్లయినం గురుకుమారులు గురువృద్ధజనలాలితుం డై
పెరిఁగినప్రతివింధ్యు దాసపుత్రుం డన కుండుదు రిదియ
నాయిష్టం బనిన నిచ్చితి నింక రెండవవరంబు వేఁడు మనిన
ద్రౌపది యి ట్లనియె. 55

క నెమ్మిని ధర్మజు నలువురు
దమ్ములుఁ దమయాయుధవముల ౕ తమవర్మవరూ
ధమ్ములయుఁదోడ సకలహి
తమ్ముగఁ బాయంగవలయు ౕ దాస్యమువలనన్ 56

వ అనిన ధృతరాష్ట్రుండు నీకోరినవరం బిచ్చితి నింక మూఁడ
వవరంబు వేఁడు మనిన ద్రౌపది యి ట్లనియె 57

ఆ. వైశ్యసతికి నొక్కౕవరము సత్త్రియ
సతికి రెండు శూద్రౕసతికి మూఁడు
విప్రసతికి నూఱు ౕ వేఁడఁ జ న్వరములు
గాన నింక వేఁడఁ ౕ గాదు నాకు 58

వ అనిన ధృతరాష్ట్రుండు కోడలిగుణంబులకు ధర్మం బెఱుంగు
టకు సంతసిల్లి యనుజసహితుం డయినయుధిష్ఠిరు రావించి
నీవు సర్వసంపదలు స్వరాజ్యంబును నొప్పఁగొని యొప్పటి
యట్ల యింద్రప్రస్థపురంబున కరిగి సుఖం బుండుము నీకు
లగ్గయ్యెడు మఱి వెండియు 59

తే నీవు నిత్యంబు వృద్ధోపకౕసేవఁ జేసి
యెఱుఁగు దెల్ల ధర్మంబులకౕనెఱుక లేక

కడఁగి నీ కెగ్గు సేసె నాకొడుకు దీని
మఱచునది నీకు నే నొండ్లుగఁ జపసేల 60

క. మనమున వేరమిఁ దలఁపమి
యును సత్యమచిత్తుఁ డగుటయును గుణములు కై
కొని దోషంబులు విడుచుట
యును నుత్తముఁ డయినపురుషున కుత్తమగుణముల్. 61

వ. ఏను బుద్ధి లేక జూదం బుపేక్షించితి నల్పబుద్ధిసత్త్వుం
డయినవృద్ధు నన్నును మీతల్లియయినగాంధారినిం దలంచి
దుర్యోధనాదులు సేసినదుర్ణయంబులు సేకొన కుండునది. సర్వ
శాస్త్రవిదుం డయిన విదురుండు మంత్రిగా సర్వధర్మ
విదుండ వైననీవు రక్షకుండవుగా నిక్కురు కులంబునకు
లగ్గగు నని ధర్మరాజుఁ బాండురాజురాజ్యంబునందు సమ
ర్పించిన 62

తరలము

తరుణి ద్రౌపది యిట్లు పాండవ ధార్తరాష్ట్రుల వైనభీ
కరపరస్పరకోపవేగము గ్రన్నఁ బాచి విపత్తిసా
గరనిమగ్నుల నుద్ధరించెఁ బ్రకాశకీర్తుల ధీరులం
బురుషసింహములన్ నిజేశులఁ బూని తద్దయుఁ బ్రీతితోన్.

---

(4) ధర్మవ్యాధుఁడు గౌశికునకు హింసాస్వరూపంబుఁ జెప్పుట.

వ. అని పలికి ధర్మవ్యాధుండు మఱియు నిట్లనియె నయ్యా!
నీవు దొలుత నావర్తనంబు గనుంగొని యిది హింసాబ
హుళంబు గాదె యని పలికితివి దాని కేను దగు తెఱంగు

సెప్పితి నది యట్లుండె హింస యిట్టిది యహింస యిట్టి దని
విభాగింప నెవ్వరికి నేర నగు 1

క. మును తమ చేసినకర్మం
బునఁ జూవె నశించు భూత-ములు సంపెడువాఁ
డు నిమిత్తమాత్ర మింతయె
యనిచెప్పఁగ వినమె యంచి-తాచారులచేన్ 2

వ. అదియునుం గాక 3

క. ఫలమూలౌషధిశాకం
బులుఁ బశుమృగతతులు భక్ష్య-ములుగా భూతం
బుల కిజుఁడు సేసె నని య
స్ఖలితంబుగ బ్రోయు శ్రుతులఁ - గా దన వశమే! 4

సీ. అనఘ! యాశీనరుం - డగుశిబి నిజగాత్ర
హింస నింద్రాగ్నుల - కిడఁడె మాంస
మతనికి లేదయ్యె - నయ్యె యుత్తమగతి
రంతిదేవుం డను-రాజు దొల్లి
యనుదినంబును గోస-హస్రద్వయంబుఁ దా,
వధియింపడే వేయి-వత్సరములు
దురిత మమ్మహితాత్ముఁ - డొందరనే వేదార్థ
నిరతులై యత్యంత-నియతు లైన

తే. ధారుణీసురముఖ్యు ల-ధ్వరములందుఁ
బశు వరింపరే పశువులఁ - బరమపుణ్య
గతులు గలుగవె వారికిఁ - గడఁగి యఘ్న
లధికమాంసార్థు లని శ్రుతు-లందు వినమె 5

క పితృదైవతకార్యములం
దతిభక్తిని మాంస మిడుట కే యర్హ మనియు ద
త్పితృదైవశేషములు స
మ్మతి భోజ్యము లనియు మునులకేవ్రతములు గావే 6

మ హాలికుం డెంతయు నోజతో దునఁగ సీ
రాగ్రంబునం జోఁకి ప్రా
ణు లనేకంబులు సచ్చు హింస యది
యాకో కాదో వేయేల మ
ర్త్యులు నేలన్ జరిఁయించుచోఁ బదములం
ద్రొక్కం బడుం బెక్కుజం
తులు హింసావిధి గా దనంగ వశమే
దోషజ్ఞ! యూహింపుమా 7

చ సలిలము లుర్వి యాకసము
సర్వము జంతుమయంబు గావునం
గలుగు నవశ్యమున్ సకల
కర్మములందును హింస హింసకుం
దొలఁగిన దేహయాత్రయును
దుర్ఘటమైనటు లుండు నింతయుం
దలఁపరు హింస సేయు మని
తారుదదెంతురు గొంద ఱిమ్మహిన్ 8

క పనివడి యహింస వ్రతముగఁ
గాని వనమున నున్న మునులకేకుం దొడరదె హిం
సనము తరుమూలఫలశా
కనిపీడన మదియు హింసకేగా దొకొ! తలఁపన్. 9

తే. హింస సేయనివాఁడు లేఁ । డిజ్జగమున
నొక్కఁడైనను దమతమ । యోపినట్లు
హింస తెరువున కెడ గల్గ । యోఁగవలయు
నదియు చూవె యహింస నా । నతిశయిల్లు. 10

వ. ధర్మంబు బహుప్రకారం బై యుండుఁ దదీయసూక్ష్మగతి దురవబోధంబు గావున శ్రుతిప్రమాణంబులవలనను వృద్ధాచారనిదర్శనంబుల వలనను నెఱింగికొనునది 11

---

### (5) ఉత్తరుఁడు కురుసైన్యంబు గనుంగొని భయభ్రాంతుం డగుట

సీ. అభినవజలధర । శ్యామంబు లగునెడ
లాకుజొంపంబుల । ననుకరింప
సాంధ్యరాగోపమ । చ్ఛాయంబులగుపట్టు
గిసలయోత్కరముల । శ్రేణిసేయ
రాజమరాళ గా । రంబులై తగుచోట్లు
తఱచుపూఁబొదల చం । దంబు నొంద,
హారిద్రరుచిసమా । నాకృతు లగు రావు
లడరెడుపుప్పొదు । లట్టు మెఱయఁ
గలయ నెగసి ధరాధూళి । లలితవనము
దివికి నరిగాపు వ్రాయెడు । తెఱఁగుఁదాల్ప
గోగణము ముంగలిగ నేల । గోడి వడఁగ
నడచుకౌరవరాజ సై । న్యంబు గనియె. 1

క. కని యుత్తరుండు గరువా,
టిన మేనును దలఁకుమనము । ఱిచ్చవడినచూ
పును నై తొట్రుపడుచు ని,
ట్లనియె దిగులు సొచ్చి యాబృహన్నలతోడన్ **2**

శా. భీష్మద్రోణకృపాదిధన్విసికరా । భీలంబు దుర్యోధన
గ్రీష్మాదిత్యపటుప్రతాపవిసరాకీర్ణంబు శస్త్రాస్త్రజా
లోష్మస్ఫారచతుర్విధోజ్జ్వలబలా । త్యుగ్రం బుదగ్రధ్వజా
ర్చిష్మత్త్వాకలితంబు సైన్య మిది యేఁ । జేరంగ శక్తుండనే

క. అకృతాస్త్రుఁడ బాలుఁడఁ గా
ర్ముకవిద్యాప్రౌఢిమై నిరూఢు లయినయా
శకుని జయద్రథ దుర్ముఖ,
వికర్ణ కర్ణాదియోధ । వీరుల కెదురే **4**

క. ఇట్టగు తెలుఁగక వచ్చితి
మెట్టొకొ మనబంగి వీర । లిందఱును గడున్
జెట్టిదులు మనకు మార్కొను
నట్టికాలదిఁ గాదు భీతి । యడరెడుఁ దోడ్తోన్. **5**

ఉ. కౌరవసేనఁ జూచి వడఁ
కందొడఁగెన్ మదితోన మేను నీ
వూరక పోవు చున్కి యిది
యొప్పనె యిప్పటిభంగిఁ జూచిన
న్వీరల నేను మార్కొనమి
నిశ్చయ మిట్లగుటన్ గయంబునం
దేరు మరల్పు ప్రాణములు
తీ పన మున్ వినవే బృహన్నలా! **6**

వ అనిన దరహాసితవదనుం డగుచు శతముఖతనయుఁ డతని
కి ట్లనియె 7

చ. అసదృశలీలఁ బొల్చురథి
కావలిమీఁదఁ జనంగ వెట్టి నే
మసలక యామిషంబు గొని
మార్గమునట్టినతుచ్ఛసైన్యముల్
వెసఁ జని మ ట్టి గోధనము
వేగ మర ల్తముగాక యిమ్మెయిం
బసు లటు ఫ్రొవఁగా మరలఁ
బాడియె నీకు నరేంద్రనందనా. 8

ఉ. అంతిపురంబులోనఁ గల
యంగనలెల్లను నెమ్మనంబులన్
సంతస మందఁగాఁ బసులఁ
జయ్యనఁ దెచ్చెద నంచుఁ బూని నీ
వెంతయు మేటి వై యరద
మెక్కి రయంబున వచ్చి యిచ్చటన్
దంతితురంగసద్భటక
దంబముఁ జూచి కలంగు టొప్పునే 9

ఆ. అనినపలుకులకు బృ హన్నలఁ గనుఁగొని,
యెలుఁగు వడఁక నాతఁ డిట్టు లనియెఁ
బసుల దయ్య మెఱుఁగుఁ బడఁతులసంతోష,
మేల నాకు ననికిఁ జాల నేను. 10

వ. అనవుడు. 11

చ. తనభుజశక్తియుఁ రిపుల
దర్పము నేర్పడఁ జూచి చూచి యె
ట్లును దెగ కున్నఁ బోక యిది
లోకముచక్కటి శూరులైన దీ
నిని మది మెచ్చ రీబలము
నీదెసఁ దేఱియుఁ జూడ దింతకుఁ
మును భయహేతు వైనవిధ
ముం దగఁ జెప్పుము నాకు నిత్తఱిన్. 12

సీ. దెసలు బీఁటలు వాఱఁ దివురుచిందములకో,
లాహాలంబులకుఁ గ లగఁబడక
యురువడి సేనలు దొలఁ బైఁ దోఁతెంచు,
ధూళి పెల్లడరినఁ దూలపోక
చతురంగబల మతి సాంద్రతఁ గవిసిన,
యగ్గలికమునకు బెగ్గడిలక
శస్త్రాస్త్రములు రథ్య సారథివర్మాంగ,
తతి నాటుతఱచునఁ దల్లడిలక

తే. బహువిధంబుల బగతురబరవసమున,
నిత్తెఱంగునఁ గలుగు క్రంతదెల్ల నోర్చి
నిల్చి గెల్చిన సత్కీర్తినెగడుఁ గాక,
దవ్వుదవ్వుల నిక్కైననవ్వ రెట్లు 13

చ. అనుదివిజేంద్రనందనున
కమ్మను జేశ్వరసూనుఁ డిట్లనుఁ
వినుము త్రిగర్తవాహినులు
విక్రమసంపద సొంపు మీఱఁ గో

ధనములఁ బట్టినం బతి యు
దగ్రత సైన్యము లెన్ని యున్నియుం
గాని యటు వ్రాయఁ గాన మన
కుంబురి బాసట లేర యెవ్వరున్ 14

తే ఒంటిఁ దలపడి కురుసేన నోర్చువాఁడ
నే యి దేటికి వెడమాట లిట్టు లాడ
వారు గానక మున్కలఁ దేఱ దోలు
కొని రయంబునఁ బురికరుగుటయు నీకు! 15

వ అనినం బార్థుండు పార్థివనందనున కిట్లనియె 16

క వెగ డొంది యిట్లు పలుకఁగ
నగునే పగతురు ప్రమోదమునఁ దగఁ బసులన్
దిగ విడిచి పురజనంబులు
దెగడంగా మగిడి పోక దీనత గాదే 17

వ అట్లుం గాక 18

మ. నను సైరంధ్రి గడంగి పేర్కొనియె దా
నం బెంపుమై బిల్చి తో
డని తోడ్తెచ్చితి వీవు బంటుతనమ
ట్లగ్గించి పౌరాలి దీ
వన లిచ్చం దుదిఁ బోయి కౌరవులు గో
వర్గంబుఁ గొంపోవఁగాఁ
గని యేఁ గ్రమ్మఱి రిత్త వ్రాదునె భయో
త్కంపంబు ని కేటికిన్. 19

తే. చిత్తవృత్తి యొక్కఁచుక ♦ చిక్కఁ బట్టి
యిపుడ కౌరవసైనికు ♦ లెల్లఁ జూచి
వెఱఁగుపడ వేగమును లావు ♦ వెరవు మెఱయఁ
గదుపుఁ బెట్టించి పోదము ♦ గ్రమ్మఱంగ 20

వ. అనుచు విన్వచ్చుండు గడంగి తేరు వ్రోవ నిమ్చుటయు నాననంబు పల్లటిల్ల మానసంబు దల్లడిల్ల నాభూవల్లభ కుమారుండు. 21

క. దవ్వుల విఱిగినఁ బారులు
నవ్వుదు రెఱు మేలు మేలు ♦ నను నాఁగకు నీ
క్రొవ్వఱుగ దేని దలపదు
మెవ్విధిఁ జని తేమి యనుచు ♦ నెత్తినభీతిన్ 22

క. శరములు శరాసనము న
య్యరదముపై డిగ్గ విడిచి ♦ యతిరభసమునన్
ధరణికి లంఘించి వెసం
బురిదెసకును లజ్జ వీటిఁ ♦ బోవం బాఱెన్ 23

వ. ఇట్లు వాఱినం దనమనంబునం గుత్సించుచు బీభత్సుండు యుగ్యంబుల పగ్గంబులు నొగల ముడిచి రథంబు డిగ్గ నుఱికి లంబకేశభారుండును నాందోళిత రక్తాంబక యుగళాంచలుండును నగుచు నతని వెనుకం బఱచు సమయంబున నిలిచి కనుంగొను కౌరవబలంబునందు 24

ఉ. అజ్ఞులు కొంద అప్పు డప
హాసము సేయుచు గూఢరూప రే
ఖాజ్ఞత లేమిఁ దద్విక్రియా
కాయము మీఁదను దృష్టి నిల్పఁగాఁ

ప్రాజ్ఞులు మూర్తిసౌమ్యతయు
బాహులదీర్ఘతయుం బటుత్వత
త్త్వజ్ఞతయుఁ గతిస్ఫురదు
దాత్తతయుంగని సంశయంబుతోన్ 25

తే. ఆఁడుచందంబుఁ బురుషసమాకృతియును
గలిగి యున్నవి యొప్పు నాకిమ్మలతసొంపు
వికృతవేషావృతంబునై కి వెలయు నితఁడు
నిపుణు గవిసిన మెఱయనికిలిప్పఁ బోలె 26

ఉ. బాహులచాయయుఁ గమన
భంగియు నర్జునునట్ల వీన సం
దేహము లే దితండు తన
తేజము డాఁపఁగ మత్స్యభూమిభృ
ద్గేహమునందుఁ బేడి యనఁ
గీడ్పడియుండెనో కాక యూకరు
వ్యూహముతోడికయ్యమున
గొండొకరుండిటు లొంటి వచ్చునే 27

చ. విరటుఁడు దక్షిణంబునకు
వీరుల సారథులన్ నిజాజికై
పురిఁ గలవారి నెల్లఁ గొని
పోయిన నొండులు లేమిఁజేసి యు
త్తరుఁ డిట వచ్చు చూడి యర
దంబు దగం గడపంగ నెవ్వరుం
దొరకొన కున్నఁ దా నితని
దోడ్కొని వచ్చినవాఁడు సూడఁగన్. 28

చ. పరి సను దెంచి గోగణముఁ
బట్టి రణం విని పిన్న గాన మీఁ
దరయక రాజనందనుఁ డ
హంకృతిమైఁ బఱతెంచి సైన్యవి
స్ఫురణముఁ జూచి భీతిఁ దన
బుద్ధిగలంగినఁ బాఱఁ జొచ్చె ని
ప్పురుషుని శౌర్యసంపదయు
భూరిబలంబు నెఱుంగఁ డేమియున్ 29

వ. అనుచు నిశ్చయరహితహృదయుం డగుచుం జుండాలంబియ
లీలాసమరేఖం బగుగమనంబునం బురుహూతపుత్త్రుండు
పదశతమాత్ర ప్రదేశ పలాయితుం డైన భూమింజయు
నెయిది పట్టికొనిన నతండు 30

సీ. వెలవెలఁ బాఱుచు ॥ వగఁ గందుఁ బెదవుల
తడి యాఱ నెండియుఁ ॥ దల్లడిల్లు
జల్లన నంగంబు ॥ తెల్ల నిగ్గఁ జెమర్చుఁ
బదపదంబులఁ గరములుఁ ॥ గుదియ వడఁకు
హృదయంబు తటతట ॥ నదరంగఁ బెలుకులు
దీనగృష్టుల వెంటఁ ॥ దేలిచూచు
నెలుఁగు గద్గదికఁ దొట్రిల నేడ్చు విడు మని
ప్రార్థించు మాటఁ గిరీటిపాటు దోఁప

తే. నిష్కళంకశుద్ధహేమంబు ॥ నిర్మలోజ్జ్వ
లాష్టవైదూర్యములుఁ దురగాఢ్యరథముఁ
గరటిదశకంబు నొకయూరుఁ ॥ బురము సొచ్చి
నపుడ యిచ్చెద నీకను ॥ నార్తుఁ డగుచు 31

క. నాతోఁడి ప్రేముడిం గడు
నాతుర యై యెదురు చూచు నంబకుఁ జేతః
ప్రీతిగఁ జని యాయమఁ గొడు
సూతుం బోనీఁ గదే విశుద్ధచరిత్రా! 32

### అర్జునుఁ డుత్తరునిఁ దనకు సారథిఁగాఁ జేసికొనుట

వ. అని మఱియు నానావిధదీనాలాపంబులం బ్రార్థించుచుండం బార్థుండు నగుచు నతనిం దేరు సేరం దెచ్చి. 33

చ. వెఱవకు మన్న పోటు కురు
వీరులతోడ నశక్యమేని య
త్తెఱఁ గది యేల నీ కుడుగు
తేరికి సారథి గమ్ము నాకుఁ జి
చ్చఱపిడు గొట్టు లట్టడరి
శూరుల మొత్తము నుగ్గు సేసెదం
బఱపెద సేన రాజుధృతిఁ
గాపెద గోవులఁ గ్రమ్మఱించెదన్. 34

క. అనుచు నోడంబాటు లేకు
న్నను నయ్యుత్తరుని నొగల నడుకొన నిడి తా
నును రథ మెక్కి రథికుఁ డయి
చనియె నరుఁడు జమ్మి చేర సమ్మదలీలన్ 35

## (౬) అభిమన్యుని వివాహమహోత్సవము

వ. ఇట్లు వైవాహికవర్తనసంవిధానసావధానుం డగుమత్స్య
మహీనాథుండు మహామౌహూర్తికాది శిష్టజనులు పరివేష్టింప
నుండి లగ్నం బాసన్నం బగుచు వచ్చె నని ధర్మతనయున
కెఱింగింపం బనిచిన నతండు ననుజసహితంబుగా నలం
కృతుండై వివిధప్రసాధనశోభితు లగు సమస్తబంధు
జనంబులం గూర్చికొని యభిమన్యునకు శృంగారంబు
సేయించి భద్రగజారూఢుం జేసికొని యేనుంగులం బేరు
గలవారువంబులను బట్టపుదట్టంబు సేసికొని మణిగణం
బులుఁ బుష్పపుంజంబులు ఫలప్రచయంబులు లోనుగాఁ
గల యోగ్యవస్తువుల విస్తరిల్లినక్రంత నడచు మంగళ
తూర్యనాదంబులు విప్రాశీర్వాదంబులు వందిజనవాక్య
సంతానంబులుఁ జెలంగ వాసుదేవపురస్సరంబుగా విరాటు
మందిరంబున కేతెంచి శంఖవిజయఘంటాపణవాది
నిక్వణంబులతోడ నెదుర్కొని చల్లుసేసలు గైకొనుచుం
జొత్తెంచిన 1

క. విరటుఁడు సంభ్రమమును నా
దరమును భక్తియును నాత్మఁ దలకొనఁ బూజా
పరుఁడై సమయసముచితా
చరణంబులు నిర్వహించె సమ్మదలీలన్. 2

తే. విహితపరిపాటితో విప్రవృద్ధజనులు
పుణ్యకర్మపరంపరఁ బూని నడప
నర్థిఁ గృష్ణయుధిష్ఠిర పార్థమత్స్య
వరులు తెరయొద్ద నవ్వధూవరుల నిలిపి 3

వ. సాంవత్సరికదత్తకాలకళావిశేషంబుల మంగళతూర్యంబులు
సెలంగ నత్తెఱ యెత్తించిన **4**

**ఉ.** వీనులఁ దియ్యమెక్క మును
విన్కిఁ బరస్పరరాగవృత్తి లో
నూనినఁ జూచువేడ్కల
నువ్విళు లూరెడునెమ్మనంబు ల
చ్చో నొకయింతసేపు నెడ
సొచ్చుట కోర్వక యుండ నున్న య
మ్మానినియుం గుమారుఁడును
మారవికారము లంకురింపఁగన్ **5**

వ. అన్యోన్యావలోకనంబు సేయునప్పుడు **6**

సీ. వరుచూడ్కి ముద్దియ వదనంబుపై బాఱి
తివుటమై నునుఁగాఁతి తీపు గ్రోలు
సుందరీరత్నంబు చూపు మనోరమా
నడుఁబలరొప్పుపై నెల్ల నడరుఁ
బతివిలోకనములు పడఁతుకమైఁదీవఁ
గలయంగఁ బలుమఱు మెలఁగుచుండు
వెలఁదికటాక్షముల్ విభునిపైఁ గ్రమమున
నెగసి మోమునఁ జోఁకి మగిడి వచ్చు

తే. నొండొరువుల లేఁజెమటల నూని వ్రేఁగు
పడినచాడ్పున నవయువభంగులంకుఁ
దగిలి మఱపునఁ దడయు నిర్దళవిశాల
నయనదీప్తులు నెఱకువ బయలుపడఁగ **7**

వ. తదనంతరంబ. 8

తే. బండారులదోయిళుల నినుపొందఁ జేయు
నక్షత్రప్రకరంబు లన్యోన్యమస్త
కములఁ బోసిరి మందారకల్పలతలు
విరులు గమియ నొండొంటపైఁ గురియునట్లు 9

చ. లలితతనూవిలాసముల
లజ్జకతంబునఁ జేసి మున్ను వి
చ్చలవిడిఁ బట్టఁగా వెరవు
సాలక రౌరలు వాఱుచూపులన్
లలిఁ దలఁబ్రాలు వ్రాయునెడ
లందగ వొందిన నూలుకొల్పి యి
మ్ములఁ బచరింతు రొండొరుల
మోహనమూర్తులపై వధూవరుల్. 10

తే. చిత్తమున గాఢరాగంబు చేతఁ జూపు
తెఱఁగు దోఁపఁ గెంపారె తీఁగఁబోఁడి
మృదులపాణిఁ గుమారుఁడు మెలపుమై గ్ర
హించె బల్లవాలంబిమత్తేభలీల. 11

వ. ఇట్లు పాణిగ్రహణం బాచరించి 12

క. పెనుఁగుదుట నిడినచూతం
బును నవమాలికయుఁబోలెఁ బాలు పొంది రతం
డును నమ్ముగ్ధయు నేకా
సనమున నున్నపుడు నూత్నసౌభాగ్యమునన్ 13

సీ. కోర్కులు గడఁగూడఁ గాని పారమెత్తన
చిత్తంబు లూఁటఁ జిగుళు లొత్తఁ

బులకాంకురములకుఁ దలతాఁకు డై యిరు
మేనను నువ్వ బు మిగిలి పొదలఁ
దఱి వేచి చనఁబోయి తడఁబడి మార్గతి
పడి చూపు లాడట బయలుపఱుపఁ
జెమటలతావులు తెమలోనఁ గలసి వే
ఱొక్క సౌరభము నై చొక్కు సేయ

తే. గాఢసాన్స్పర్శభంగులు గలుగునట్ల
హాసమసమయకృత్యంబుల నొదవి సౌఖ్య
రసము వెన్నిట్ట పొరిఁబొరిఁ గ్రమ్మ దేర
సమ్మదాంబుధిఁ దేలిరి సతియుఁ బతియు 14

---

## 7. శ్రీకృష్ణుఁడు ధృతరాష్ట్రుతో సంభాషించుట

క. జలదస్వనగంభీరత
నెలుఁ గొప్పఁగ దంతదీప్తు లెసఁగ ముకుందుం
డలరుచెవుల నఖిలజనం
బులు వినధృతరాష్ట్రభూవిభున కిట్లనియెన్ 1

క. జననాథ ! నీయెఱుంగని
పనులు గలవె యైన దగవుఁ బరమహితంబుం
దన వారికిఁ జెప్పన తగు
నని వచ్చితి భారతాన్వయము ప్రియ మొందన్ 2

క. క్షీరోదకగతిఁ బాండవ
కౌరవు లొండొఁగూడి మనికి కార్యం బది నీ

వారసి నడపుము వారన
వీరనఁ గురుముఖ్య! నీకు కై వేఱుం గలదే 3

చ భరతకులంబు ధర్మమును
బాడియు సత్యముఁ బొత్తుఁ బెంపునుం
గరుణయుఁ గల్గి యుండు ననఁ
గానుతిఁ గన్నది యందు సద్గుణో
త్తరులగు నీవు నీయనుఁగుఁ
దమ్ముఁడు నీతనయుల్ యశోధురం
ధరశుభశీలు రీసుచరి
త క్రమమిప్పుడు దప్ప నేటికిన్ 4

శా ఈవంశంబున కెల్ల నీవ కుదురై
దివ్యానిచందంబు లె
ల్లైవ ర్తిల్లఁగ నీడు మేలుఁ దుది నీ
యందొందెడుం గాన స
ద్భావం బారసి లోనిపొత్తు వెలివ
ర్తింబుగా జన స్తుత్యముల్
గావింపం దగు నీక యెవ్విధమునం
గాంక్ష్యవంశాగ్రణీ! 5

చ వినుము సుయోధనాదు లగు
వీరు సధర్ములు గా కార్యము
ల్గానక మహార్థసిద్ధి దొడ
లుందమ కిట్లన కన్వయంబువ
ర్తస మిది గాదు నాక బెడి
దంపుఁ దనంబున బంధుకోటికి

న్మనములు నొవ్వఁగా నవగు
ణంబులకుం బుయిలోడ రేమియున్. 6

ఉ కౌరవపాండవుల్ తెఱఁగు
గైకొని శాంతతఁ బొంది యున్కి మే
లౌరయ నాకు నీకుఁ గుల
మంతకు నీనృపకోటి కుర్వికిం
బోరితమైన నింతకును
బుట్టు మహాపద గావునన్ హరి
శ్రీరమణాగ్రగణ్య! గణు
తించియవశ్యముఁ బొం దొనర్పవే 7

తే నీకు వీరలఁ దీర్పంగ నేర వచ్చు
నధిప! తెఱఁగు నీవశమునయ్యెడు కాన
నీకు వీరలఁ దేర్చుట నెఱియ కాదె
సిద్ధ మెవ్వారిఁ దలి పొందఁ జేయ నేర్తు 8

ఉ అందు వృకోదరార్జునుల
నాహవరంగమునందు మీఱువా
రెందఱొ యెన్నమా యిచట
నీకురు భీష్ములఁ గ్రేణి సేయువా
రెందఱొ వారు వీరు నని
నీల్గుటకంటె భవద్బలంబులై
యందఱుఁ గూడి టొప్పదె జ
నాధిప! శాంతి యొనర్పు మెమ్మెయిన్ 9

తే జగతిఁ గలజనపతులు నీచరణపీఠ
మర్థిఁ గొలువ సముద్రవేలావృతోర్వి

యెల్ల నేలుట యెప్పుడే § తల్లి ప్రజల
యెడ విరోధంబు వాటించు § టెంత మేలు **10**

క నరనాథ ! నీ వుపేక్షా
పరుఁడ వయినఁ గౌరవులకు § పాండవులకు గా
దరయఁగ భూప్రజ కెల్లను
దురితం బొనరించినట్లు § తుదిఁ గీడు **సుమీ** ! **11**

క కౌరవపాండవులం దె
వ్వారలకుం జావు నొవ్వు § వచ్చిన మే లు
ర్వీరమణా ! చిత్తమున ని
ట్లారయుమా నీకు దుఃఖ మగు నెట్లయినన్ **12**

ఉ వీరును వారుఁ బండితులు
విక్రమవంతులు బాహుగర్వదు
ర్వారులు లోనిరిత్తబవ
రంబున నాఱడి సావఁ బోవ నె
ట్లూరక యుండ వచ్చుఁ గడు
నొప్పెడు మేనులు వాఁడికైదువుల్
గూరఁగ నాటిసం బుడమిఁ
గూలుటొక్కటొ యోర్వవచ్చునే. **13**

ఆ ఇట్లు గాక యుండు § సిరెండుదెఱఁగుల
వారిఁ గాచికొనుము § నసుమతీశ !
నీదు ప్రాభవంబు § నీతియు శాంతియు
నఖిలజనులుఁ బొగడునట్లు గాఁగ **14**

వ అని చెప్పి వెండియు **15**

తే పాండవులు దండ్రి సచ్చిన ప్రజలు వారి
నరసి ప్రోచితి శైశవ మాది గాఁగ
నడుమ నిష్కారణము గాఁగఁ దిగున
సార మొందగ రక్షింపు గారవమున 16

వ పాండుకుమారులు నీకుం బరమధర్మపరాయణమిల్లి యుండఁబు నోక్కమాటగా నీతోఁ జెప్పకుని నాకుం జెప్పినవిధంబు వినుము తనపుత్రుం బండ్రెండువత్సరంబులు వనంబున వసియించితిమి పదుమూఁడగునేఁడు జనపదంబున నజ్ఞాత వాసంబునుం జలిపితిమి మాతండ్రిసమయంబు పరిపాలించియే మర్ధరాజ్య మెట్లునుం బడయుదు మని కృతనిశ్చయులమై పడితిమి తల్లియుఁ దండ్రియు నెల్లచుట్టంబులు నేడు గడయును మాకుఁ దాన. మాపలన నేరమి గల్గినం గినిసి యిట్లు గా దట్లని చక్కం జెట్టునద తానుగల పదివేలేం డ్లకుం దిన్న కాని మఱియొకుంగ మెట్టివారమైనను మమ్మును దుర్యోధనాదులు దలంపరు తనయందుఁ దెలంగు గలిగిన నెవ్వరు గోల గాకున్నను గులంబుపాడి సెడక చెల్లు నని రని మఱియు నిట్లనియె 17

ఉ సారపుధర్మముల్ విమల
సత్యముఁ బాపముచేత బొంకుచేఁ
జారముఁ బొంద లేక చెడఁ
బాలివి యైనయవస్థ దఱు లె
వ్వారు లుపేక్ష సేసి రది
వారలచే టగుఁ గాని ధర్మని

స్తారక మయ్యు సత్యశుభ
దాయకమయ్యును దైవ ముండెడున్ 18

వ. అని యీసభ్యులకుం జెప్పు మనిరి నీవును సభాసదు లైన రాజులు నేమనియెద రనుం డేను ధర్మంబును నీతియును మున్నిడికొని మనోవాక్ప్రకారంబు లేక రూపం బైనస త్యంబ కాఁ జెప్పితి నిత్తెఱంగు మీకు మేలు క్రోధమా నమత్సరంబులు విడిచి యిట్లు సేయుండు 19

ఆ. పాండవులకుఁ దగిన § పాలు మేదినిఁ బంచి
యిచ్చుకంటెఁ గార్య § మెద్ది గలదు
ధర్మ మెద్ది సముచి § తం బగువిధ మెద్ది
శక్య మెద్ది చెపుఁడ § వాక్యవిదులు! 20

క. అని పలికె మహారాజా!
వినుమని ధృతరాష్ట్రుతోఁడ § వెండియుఁ దాని
ట్లని చెప్పె వాసుదేవుఁడు
తనమది నఱ లేక కార్య § దశ దెలియంగన్ 21

ఆ. వారితండ్రిపాలు § వారికి నిచ్చి నీ
పాలు నీవుఁ బుత్ర § పౌత్రచయము
ననుభవించి సుఖుల § రై యుండుఁ డిది బంధు
మిత్త్రసుజనకోటి § మెచ్చు తెఱఁగు 22

క. ఎఱుఁగవె యజాతశత్రుని
నెఱియును ధర్మంబు సత్యనిష్ఠయు నను నె
త్తెఱగున నను వర్తించెనో
యెఱుఁగవె తగుచేవ గలుగు § టెఱుఁగవె యధిపా! 23

వ. నీ వెఱుంగుదైనను జెప్పెద విను మింద్రప్రస్థపురంబునుండి
పాండవాగ్రజుండు నీకుం బెంపునుం బేరునుం జేయం గోరి

చ. మదమఱగించి భూపతిస
మాజము నెల్లను నిన్నుఁ గొల్వఁ జే
యుదు నని పూని దిగ్విజయ
మున్నతిఁ జేసి మహావిభూతితో
మదిమది నుండ నీసుతుఁడు
మంత్రులు సౌబలుఁజూద మార్చి సం
పద గొని యంతఁ బోవక స
భన్ ద్రుపదాత్మజ భంగపెట్టరే 25

ఉ. దానికి నీ వొడంబడితి
ధర్మజుఁ డంతయుఁ జూచి సత్యముం
బూని వృకోదరార్జునులు
బొంగులుగాఁ బెడచేతఁ గన్నునీ
రూనఁగ నొత్తుకొంచుఁ జని
యుగ్రవసంబున దుఃఖమగ్నుఁడై
దీనత నుండి పూన్కి దగఁ
దీర్చియుఁ గూడి మనంగఁ గోరెడిన్ 26

క. తనుఁ దాన పోలుఁ గాకే
మనవచ్చు నజాతశత్రుఁ డతిశాంతతయున్
వినయము గౌరవమును నే
జనపతులకుఁ గలవు సెప్పుమ సౌజన్యనిధీ ! 27

క. ఏ నిం తాడితి నీనం
తానం బిరుదెఱుఁగునకు హితము గోరి భవ

త్మానునిమతియతిలోభము
మానిచి పాండవులఁ దెమ్ము కై మనుజాధీశా! 28

ఉ. వారలు శాంతశూరులు భ
 వచ్చరణంబులు గొల్వఁ బూనియు
న్నా రటుఁ గాక మీ కది మ
 నంబున క్రిమమేని యింతకుం
బోరికి వచ్చుచుండుదురు
 భూవర! రెండు దెఱంగులందు నీ
కారయఁ బథ్య మేది యగు
 నవ్విధ మేర్పడ నిశ్చయింపుమా. 29

చ. అనవుడు రోమహర్షణము
 లంగములం బొడమంగ సదస్యులె
ల్లను బ్రియ మంది నెమ్మనము
 లం బురుషోత్తనుఁ డింత యొప్పఁ బ
ల్కెనె మఱుమాట లాడ నయ
 కోవిదుఁ డెవ్వఁడు ధీరుఁ డెవ్వఁ డిం
దనువరి తెవ్వఁ డంచు నచ
 లాకృతులై నెఱి నూరకుండఁగన్. 30

---

## (8) మంకిచరిత్రము

సీ. మంకి నాఁ బరగు బ్రాహ్మణుఁడు ధనేచ్ఛమై
 వర్తించు శిక్షింపకేవలయునట్టి
గుజ్జుకోడెల జట్టిగొని ప్రీతి లంకించి
 యుండ లంకియతోన కై గండు మీఱి

పా తె నక్కోడియల్ § పడియున్న చనుప లో
ట్టేనుంగుపై నది § యెగసి పఱవ
నుభయపార్శ్వంబుల § నురివ్రాసిన ట్లవి,
వ్రేలి చచ్చినఁ జూచి § విప్రుఁ డడలి
తే రత్నములుఁ బోని వత్సతి§రంబు లకట
వ్రేలు చున్నవి లొట్టేను§వెంటఁ దవిలి
యనుచు నిర్వేగ మొంది యి§ట్లనియెఁ దన్నుఁ
గరుణతోడఁ గనుంగొను§నరులతోడ 1

తే నారమతిఁ బరికింపంగఁ § బౌరుషంబు
కంటె దైవంబు ముఖ్యంబు § గార్యసిద్ధి
కెచట నేనియుఁ బౌరుష § మెసక మెసఁగ
నేని, యది దైవదత్తంబ § యింత నిజము 2

వ కావున 3

క మనమునకు సుఖము గోరెడు
జనులకు కర్థ క్రియా వి§శారదభంగుల్
పొనుపడ విడిచి భరము లే
కునికియ యూహించి చూడ § నుర వెబ్బంగిన్ 4

వ అని పలికి యుద్దామం బైనకామంబు విడుపు వడకున్నఁ జిత్తంబునకు నిర్వృతి గలుగునే యనువిచారంబు వుట్టి తదీయోత్సారణం బూహించి యాచిత్తధర్మంబు నుద్దేశించి. 5

క నీమూలం బే నెఱింగితిఁ
గామమ! సంకల్పమునన § ౽లిగెదు సంక
ల్పామర్శరహిత మగుచే
తోముద్రం దాల్తు నేను § దుది యది నీకున్ 6

వ అని కామం బనునది గోర్కి గావునఁ గోర్కియొప్పమిం
చేటుపఱుపం దలంచి 7

తే. సొమ్ము గోరినయంతన సుఖము గలుగ
దది యుపార్జింపఁగా సిద్ధి యగుట నిజమె
కలిగనేని యనేకచింతల నొనర్చుఁ
జెడుట చావుతోఁ దుల్య మయ్యెడుమ యేల 8

వ ఇచ్ఛానిరసనంబు సుఖం బని వెండియు 9

క శోకశ్రమతృష్ణలకుఁ
నీకలిమియ మూల మగుట సీకగపడువాఁ
డేక త్రవ్యము గాసం
డో కామము ! నిన్నుఁ దొఱఁగి యుండెద సుఖినై 10

క నీ వాసపఱుప ధనములు
గావించెడఁ బో వినాశకములు నుడుపఁగా
నీవశమె కాన నీచెడు
టేవగపుం దేదు పెనుపదేద్దైన్యంబున్ 11

చ. సులభమొ దుర్లభంబో యని
చూడ నెఱుంగవు గన్నదానిపై
నలముదు కామమా ! యిటుమ
లందఁగఁ జేయుదు నిండు టెమిటం
గలుగదు నీకు నీతెఱఁ గగాధ ర
నాతిలభంగి నీవు స
న్ప్లాలమునఁ బోవ కొండి నినుఁ
బుచ్చెద బచ్చెనరూపుప కలన్. 12

తే. ధనముచేటున విసివి నామనమున నిన్ను
నీడవిడిచె నో కామమ! యేను శాంతి
దాంతిసత్యక్షమాభూతదయలఁ జెందిఁ
నాఁడె లోభాదు లొందవు నన్ను నింక 13

తే. కామసుఖ దివ్యసుఖములకాంక్షఁ దొఱఁగు
మేలిషోడశాంశంబులఁ బోల లేవు
గానఁ గామమ! నిను శత్రుకరణిఁ జంపి
బ్రహ్మపురమున నుండెద రాజుఁబోలె 14

వ. అని పలికె మంకి యివ్విధంబునం గోడెలు నచ్చినం బుట్టిన నిర్వేదనంబున సకలకామంబులం బరిత్యజించి దేవసముండై యుండె నని చెప్పిన విని పాండవాగ్రజుం డేమి వర్తనంబున నరుండు వీతశోకుం డగుచుఁ జరించు నెద్దానం జేసి పరమగతి వడయు ననుటయు ననిమిషనదీనందనుం డజగరచరితం బనునితిహాసంబు వినుము దాన నీయడిగిన యర్థంబుఁ దేటపడు దానిం జెప్పెద నజగరనామధేయుం డగునొక్క బ్రాహ్మణుని బ్రహ్లాదుండు శమప్రకారంబు నుపదేశింపు మని యభ్యర్థించిన నతం డతని కిట్లనియె 15

---

## భీష్ముఁడు ధర్మజునకు గరుత్మంతునిచరిత్రంబు సెప్పుట.

సీ. కశ్యపుభార్యలు కద్రువ వినత నాఁ
గల రాతపస్వి వారలకు వరము
గరుణ నిచ్చెద ననఁ గద్రువ వేవుర
వినతి యిద్దఱ వేఁడికొనిరి సుతుల

మునియు న ట్లగుఁగాక § యనియెఁ బదంపడి
యండముల్ వేయును § నండయుగము
వరుసన యాకద్రువకు § వినతకుఁ బుట్టె
నవి కుండముల నిడి § యరసి యుండి

తే రవి సహస్ర మేనూఱేండ్లు § నైన నుదయ
మయ్యె నవ్వేయిగుడ్డుల § నధిక బలముఁ
దేజమును గల్గి యాసర్ప § రాజి యొప్పు
చుండె నారెండు విరియక § యుండె మఱియు. 1

క. తనసవతి యైనకద్రువఁ
గని వగపును మత్సరంబుఁ § గదిరెడుమదితో
వినత కడుఁ వేగిరపడి
యనియతి నొకయండ మవియ § నడిచె నరేంద్రా ! 2

వ. అడిచిన నందు 3

క. పులుఁగొకఁడు పూర్వాంగము
గలిగి జనించుటయు వానిఁ § గని యాసతి గ
న్నుల నశ్రుజలంబులు పె,
ల్లొలుకఁగ శోకమున మునుగు § నుల్లముతోడన్. 4

వ. నివ్వెఱపడి యుండ నయ్యండజంబు. 5

చ ఇరువుర మేము పుట్టుదు మ
హీనపుమేనులతో మహాబల
స్ఫురణ వెలుంగ నప్పెనుపుఁ
బొందఁగ నీ కవియించి తిట్లు మ

త్సరమునఁ జాపలంబునను
దత్ఫల మందుము నీసపత్నికిన్
వరవుడ వై చరింపు మని
వారని నెవ్వగ శాప మిచ్చినన్. 6

క. వెలవెలఁ బాఱుచు వడఁకుచు
నలుకుచుఁ దనమోముఁ జూచుకొనయ్యంగన న
ప్పలుఁగు కృపఁ జూచి తల్లీ!
వలవ దడల నిది విధాతృకవశ మయి వచ్చెన్. 7

వ అని వెండియు. 8

శా ఏనూఱేండ్లకుఁ బుట్టు నాయనుజుఁడిం
కీయున్న యండంబు నె
ట్లైనన్ ధైర్యము గల్గి కావుము ప్రయ
త్నాసక్తిమై వాఁడు ద
ర్పానూనుండు బలాభిరాముఁడు మదీ
యస్ఫూర్తిమన్మూర్తి నీ
కానందంబుగ నీఁగు దాస్యము త్రిలో
కాశ్చర్యసంపాది యై 9

వ అనియె నిట్లు ప్రథమపుత్రుండు వికలాంగుం డగుటకును
శాపప్రాప్తికిని బరమనిర్వేదనంబు నొంది వినతయు నవ్వి
హంగంబు నిర్దేశించినకాలంబుఁ బ్రతీక్షించి యయ్యండంబు
రక్షించికొని యుండం దత్సమయసమాగమంబున 10

చ. ఘనతరకంధరుండు దృఢ
కాయుడు దీప్తముఖుండు రక్తలో

చనుఁడు మహెూత్తమాంగకుఁడు
చారుసుసంగతపక్షసారమం
డనుఁడు పరిస్ఫురద్ద్యుతివి
డంబితబాలదివాకరుండు లో
కనయనపర్వనిర్వహణ
కారి సుపర్ణుఁడు పుట్టె భూవరా !, 11

క ఆసమయంబున నరుణో
ద్భాసితగాత్రుండు దొలుతఁ బుట్టి యరుణుఁ డు
ల్లాసి యగుచు రవిపరిచ,
ర్యాసుఖ మొద గోరి చనియె నం బరవీథిన్ 12

మ జననిం బాసి జనించునప్డ తనయి
చ్చం బక్షినాథుండునుం
జని పద్మోద్భవకల్పితంబు లగు భో
జ్యంబుల్ శరీరంబు వ
ర్ధన మొందింపఁగ సిద్ధసాధ్యగణముల్
దర్శ ముద్దు సేయంగ గ్రీ
డనలోలత్వమునం జరించుఁ బరితు
ష్టస్వాంతుఁ డై యెల్లెడన్ 13

వ. అక్కాలంబున వినోదంబునకై యరిగి యొక్కయెడ. 14

సీ. చంచులఁ జగురాకుఁ ద్రెంచియాడుచు నలి
నెలుఁగించుగండుఁగోయిలలసొంపు
నలరుఁదేనియ గ్రోలి యన్నుసోలంబుల
మురియు తేఁటులమును జెలంత యింపు

దనిపండ్లరస మాని • తమలోనఁ జెలఁగుచుఁ
బలికెడురాచిల్క • దువురంగుఁ
గోలఁకుల కెలఁకులఁ • గూడి క్రీడించు చుం
డెడునంచతండంబు • నడబెడంగుఁ

తే. దరఁగఁ దేలుచుఁ బూఁదీవఁ • దగులఁబడుచు
వచ్చుచిఱుగాలిసోఁకును • మెచ్చిమెచ్చి
తగిలి కొనియాడుచును వినతయును గద్రు
వయును మున్నీటిచేరువ • వనమునందు 15

వ. మెలఁగుచుండి రట్టియెడ 16

చ. కరువునఁ బోసిరో విధుని
కాంతిసుధాబ్ధితరంగఁ బెచ్చి గం
డరు వ్రుసరించిరో హరుజ
టాస్థలికిం దొడవైనయేటి పె
న్నురువునఁ జేసిరో యన మ
నోజ్ఞ సితచ్ఛవి నుల్లసిల్లుసుం
దరతురగోత్తమంబు దవు
దవ్వులఁ గాంచిరి చాగలోచనల్ 17

వ. నిజేచ్ఛమై వచ్చినయుచ్చైశ్శ్రవంబు నిట్లాలోకించి 18

క. వినత హాయ మింత యొప్పునె,
యనూనధవళ ప్రభాఢ్యమై యని పలుకన్
విని కద్రువ యపరాంగం
బున నీలిమ దోఁచె ననియె • భూపవరేణ్యా ! 19

చ అనవుడు నమ్మృగాక్షి యిటు
　　　　లాడితి నవ్వుల కాడితో నిజం
　బునకునో నీదు చూపునకుఁ
　　　　బోలిన భంగియొ చెప్పు మన్న న
　వ్వానిత దరస్మితస్ఫురిత
　　　　వక్త్రముతో నిది యేటిమాట న
　ల్లనియెడ గాన రాదె తెమ
　　　　లంబలుకం బని యేమి నావుడున్ 20

వ. వినత దెలియం జూచి 21

ఉ. కా దని పూని పల్కుటయుఁ
　　　　గద్రువ పన్నిద మేమి దీనికి
　న్వా దిది యేల రిత్త యని
　　　　నట విని యాసతి నిక్కమేని ని
　వేది పణంబుగాఁ దలఁచిఁ
　　　　యేర్పడఁ జెప్పితి దాని కేను సం
　వాదము సేయుదాన గరు
　　　　వంబుగ నొక్కటి నిశ్చయింపుమా 22

వ అనిన విని కద్రువ వినతవదనంబునఁ జూడ్కి నిలిపి 23

తే. నీవు గెల్చిన దాస్యంబు । నీకు నేను
　జేయఁగలదాన నేను గెల్చినను నీవు
　నాకుఁ జేయంగఁగలదాన । వీకడింది
　పన్నిదము సఉ మని తెగఁ । బాఉ పలికె 24

క ఆపొలఁతి యట్లు పల్కిన
　శాపము ప్రేరేప నరుణ । జననికి నుతా

హాోపేత మయ్యెఁ జిత్తం
బాపన్నిదమునకు నేమిసేయనఁగల దధిపా! 25

వ ఇట్లు వినతయుం దెంపు సేసి యత్తెఱంగున కియ్యకొనియె
నయ్యిరువురుఁ బంచమహాభూతంబులు సాక్షులుగాఁ బల్కి
పన్నిదంబు సఱచిరి కద్రువ పతిపరిచర్యకుం గాలం బయ్యె
మఱి వచ్చి యశ్వంబు నాలోకింత మని నెపం బిడి యప్ప
టికిం జూపు దప్పించి యవ్విధంబున మగిడి యరుగు
దెంచిరి తదనంతరంబ 26

సీ కుటిలంపుఁ దలఁపునఁ ✽ గొడుకుల రావించి
కద్రువ యి ట్లనుఁ ✽ గన్నునీరు
దొరఁగంగ వారలతో నబ్ధిపొంతకు,
వినతయు నేనును ✽ వేడ్క నరిగి
యచ్చ తెల్పునఁ గడు ✽ నభిరామ మగునొక్క
యశ్వంబుఁ గాంచితి ✽ మవ్వధూటి
కేవలధవళంబు ✽ నా విని యొడ్డార
మునకు నే నదె నల్లఁసేదనము గంటి

తే వెనుక దెస నన్న వాదయ్యెఁ ✽ గనలి పన్ని
దంబు సఱచితి మోడిన ✽ దాస్యవృత్తి
వచ్చు సవతికి నే నెట్లు ✽ వరవుడంబు
సేయఁ దగుఁ దోఁక నల్లగాఁ ✽ జేయరయ్య! 27

చ అనవుడు వాసుకిప్రభృతు
లక్కట ధర్మువు గాదు నీవు మా
చిన తెరు వట్టిగెల్పు శుభ
సిద్ధి యొనర్చునె యట్లు గాక య

వ్వనితయుఁ దల్లిగాదె గరు
వంపుఁ దనంబునఁ జూడ మాకు ని
ట్లనఁ దగునమ్మ! యెట్లయిన
నయ్యెను బాపము సేయ వచ్చునే! 28

క. ఈవిధ మెమ్మెయి నైనం,
గావింపఁగ వలయు ననుట కు గల్గినఁ బందే
శౌవాసుల మగుడుము మము,
నీవింకం దగదు తల్లి! కు నిర్బంధింపన్ 29

క. అని రట్టియెడం గొందఱు,
జననిఁ దొఱఁగి యెక్కడేనిఁ కు జని రాభంగిం
జనినతనూజులఁ బేర్కొని,
నెనరువిడిచి యానెలంతకునిష్ఠురమతియై 30

**కద్రువ దనకొడుకులకు జనమేజయుని వలన నాశంబు గల్గునట్లు శపించుట**

చ. అమృతకరాన్వయంబున మ
హాముని వేడ్కఁ నరుండు పాండుభూ
రమణుని దేవి గొంతియుద
రంబునఁ బుట్టె ధనంజయాదినా
మముల వెలుంగుఁ దత్సుతుని
మన్మఁడు సంభృతధర్మ్మమైనపే
ర్మి మెఱయ నేల యేలు జన
మేజయ నామ్ముఁ డరాత్యజయ్యుఁడై 31

ఉ. ఆతఁడు సర్పయాగ మను
నధ్వరముం గుపితాత్ముఁ డై బితృ
ప్రీతిగఁ జేయఁ దద్దహన
భీకరభూరిశిఖాప్రవేశసం
జాతదురంతతాపమునఁ
జావఁగలా రని శాప మిచ్చెఁ ద
త్పాతనవృత్తి కీ వెఱచి
తక్కటినాగము లాభుజంగితోన్ 32

తే. సల్లగాఁ జేయువార మే ◆ మెల్లభంగి,
నాతురంగమపతివాల ◆ మని రయమునఁ
బోయి వాలధిరోమముల్ ◆ పొదవి నీల,
రోమసంచయ మైరి కు ◆ రుక్షితీశ! 33

క. కద్రువ గన్గొని సంతో,
షద్రుతమతి యగుచుఁ బిలిచి ◆ సవతికిఁ జూపెన్
భద్రాత్మక యవ్వినతయుఁ
దద్దోషహం బెఱుఁగ లేమికై దైన్యమునొందెన్ 34

క. నగుచుం గద్రువ వరువుడ
వగుము విచారంబు విడిచి ◆ యనుడు వినత య
ట్లగుఁ గాకని లజ్జయుఁ బెను
వగయుఁ దొలఁగఁ ద్రోచి చేసె ◆ వరవుడము దగన్ 35

వ. ఇట్లు కపటజయంబునఁ గద్రువ సత్యవినయాదిగుణవతి యయినవినతం దనకు దాసిం జేసికొని పరిహీనంబు లయిన పరిచారికాకృత్యంబుల నిత్యంబు సలుపుచుండెం బదం

పడి యప్పరమసాధ్వి దనయగ్రతనయుం డాదేశించిన
తెఱం గూహించి రెండవయండంబున జనియించినతనూజుం
దలంచుచు నాసపాటు గదిరినహృదయంబుతో దాస్యం
బనాలస్యంబున నడపు చుండ 36

ఉ యౌవనదర్ప మంది జవ
మంతకు నంతకు నగ్గలింప నై
లా వధికంబు గాఁగ నుప
లాలన సేయఁగఁ బద్మసంభవుం
డావిహగోత్తముండు హృద
యంబున గర్వ మెలర్ప నుద్ధతుం
డై విహరింపఁ జూచి యొక
యప్పుడు నారదుఁ డల్లఁ జేరినన్ 37

వ అతఁడు భక్తిం బ్రణమిల్లి నిల్చిన నప్పక్షిపుంగవునకు
నమ్మునిపుంగవుం డిట్లనియె. 38

తే దాసి వై సవతితాలికిఁ దల్లి పనులు
సేసి నలఁగఁగ నద్దెసఁ జింత వంత
లేక నీవిట్లుదిరుగుట లెస్స యగునె?
యద్భుతోజ్జ్వలతేజ, కశ్యపతనూజ! 39

చ అనుఁడు విహంగనాథుఁడు మ
దంబకు దాస్యమురాకకుం గతం
బనఘవిచార! యేది తెలి
యఁగ వినిపింపవె యన్నఁ జెప్పెన
మ్మునివరుఁ డున్నరూపు హాయ
ముం గనుటాదిగఁ గల్గుకశ్యపాం

గనలచరిత్ర మాతని క
ఖండ పరిస్ఫుటభాషణంబులన్. 40

ఉ చెప్పినఁ గోపముగ్ర వగపుఁ
జిత్తమునం గదురంగ మేలు మే
లప్ప హితంబు సేసెఁ జెలి
యాల్ మను చున్నది పెంపుతోడ నం
చప్పుడె వాయువేగమున
నయ్యెడకుం జని మాట యెద్దియుం
జెప్పక తల్లికిం బ్రణతి
సేసె విషాదభరార్తమూర్తియై 41

వ కద్రువపాలికిం బోయి. 42

చ పరమవినీతిమై నెరఁగి
బాంధవ మారఁగ నల్ల నిట్లనుగ్
గరుడుఁడు దారితారి వగఁ
గందుచు నీచెలియల్ చరించుని
వ్వరివుడువుం జరిత్రమున
వచ్చునె నీకొక పేర్మి యీసతిం
గరుణ యెలర్పఁగా విడువ
గౌరవ సంపదఁ జేయు నెంతయున్. 43

ఉ నీకును నేను బుత్రుఁడన
నెమ్మిఁ దగగ్ నను జూచి యైనఁ ద
ల్లీ! కృప సేత పెద్దయును
లెస్సయధర్మము ధర్మ మన్నగల్

నా కవి యేల దాస్యకృతి
నాజన యిత్రికి నివ్విధంబున
నాకయు దైవకృత్యమ మ
నంబున బొంగుదు విప్ప గల్గినన్ 44

వ అనిన విని మొగంబు ముఱకటింపకొనుచుఁ గద్రువ గరు
త్మంతున కిట్లనియె 45

మ బలవంతుండవు నేర్పుచందములఁ జె
ప్పం జాలి యీ రిత్తప
ల్కులఁ దేర్పం బని లేదు తల్లికి మదిం
గూర్తేని వే పోయి లో
కులు నిన్నుం బ్రణుతింపఁ దె మ్మమృతముర్
ఘోరంపుదాస్యంబు నేఁ
డొలఁగం బెట్టెద మీ కనంతి మగు సం
తోషంబు సంధిల్లఁగన్ 46

చ అన విని దాని కియ్యకొని
యప్డు సుపర్ణుఁడు వోయి కశ్యపుం
గని తనభాషణంబులును
గద్రువ పల్కులుఁ జెప్పి తెచ్చువాఁ
డ నమృత మెట్లు నే నని యొ
డంబడి వచ్చితి నన్న నాతఁ డ
త్తనయునిఁ జూచి యుల్లము ము
దంబును నచ్చెరుపాటు నొందఁగన్ . 47

క అమృతంబు దుర్లభం బ
య్యమరుల కేనియు నతిప్రయత్నంబున గు

ప్తము సేసి యుండు వాసవుఁ
డమలచరిత ! నీకు నగునె కేయట్టిది తెరఁగు 48

వ. వినుము 49

చ. ఉదకము రక్షకం బగుచు
నుండఁగ నుజ్జ్వలవహ్ని యందునుం
బొదువఁ గృపాణశక్తిముఖ
భూరితరాయుధహస్తులై బలో
న్మదులు మహోగ్రకోపులు ఘ
నస్థిరకాయు లనేకరాక్షసు
లొప్పదిగొని కావ నిప్పవల
లో నమృతంబు సురక్షితస్థితిన్ 50

క. ఉండు నన విని విహంగవి,
భుం డల్లన నగుచు నీవు కే పుత్త్రిస్నేహా
ఢ్యుండ వయి పలికితే బలి,
యుండ నుపాయజ్ఞుఁడను మహోజ్జ్వలతేజా ! 51

మ. అనుమానం బది యేల తెత్తు నమృతం
బన్నం గడుం బొంగి యా
తనిఁ దాఁ గౌఁగిటఁ జేర్చి కశ్యపుఁడు
పుత్త్రా ! నిశ్చయం బట్లయే
ని నిభంబుం గమఠంబునుం గలవు వా
నిం దిన్న లా వెక్కు నా
ఘనజంతుద్వితయంబు నీకు నెరగాఁ
గల్పించితిం బోవనా ! 52

వ. అనుటయు సంతోషించి గరుత్మంతుం డాగజకచ్ఛపంబు
లెచ్చటనుండు నెబ్భంగివి యని యడిగిన నమ్మునీంద్రుం
డవ్విహగేంద్రున కిట్లనియె 53

**కశ్యపుఁడు గరుడునకు గజకచ్ఛపంబుల తెఱం గెఱింగించుట**

సీ. ప్రాక్పయోనిధిప్రాంతఁ § బర్వతం బొక్కటి
ఘనశృంగకబళితా§కాశ మగుచు
సురగనామంబున § నొప్పు నచ్చేరువ
వసియించు నొకమహా§వారణంబు
దానితటంబునఁ § దామరకొల నబ్ధి
ననుకరించుచు మధు§రాచ్ఛవారి
సంపద సొం పారు § సమదలీలల నగ్గ
జం బానగంబుపై § సంచరింప
తే. మిట్టుఁ బల్లంబు గట్టును § మెట్టు నొక్క
మట్టమై యది నునుపారు § మహితమైన
యక్కొలన నీరు ద్రావఁగా § ననుదినంబు
నరుగు నయ్యిభవల్లభుఁ § డనఘచరిత 54

ఉ. అం దొకకచ్ఛపప్రవరుఁ
డత్యధికం బగుకాయమున్ బలం
బుం దనరన్ వసించు జల
ముం గొనువాంఛ గజంబు వ్రాయినం
జెందఁగ నీక సంగరముఁ
జేయుఁ బెనంగుచు నీరు ద్రావు గా
రుం దెగి యుండు నిట్లు పగ
రోష మెలర్పఁడ నాఁడునాఁటికిన్ 55

క వినుమధుకైటభు లనియెడు,
దనుజేంద్రులు కచ్ఛపంబు § దంతియు నై పు
ట్టినవారు దమ్మెఱుంగమిఁ,
బెనఁగుచు నొండొరులతోడ § భీకరభంగిన్ 56

క ఒంటిమెయి నుండఁగా ము,
క్కంటికి నాకచ్ఛపంబు § గారం బట్టం
గంట యరిది యొక్కొకటన,
రెంటిం బొదువంగ వలయు § రే వెర వారన్ 57

వ అనుడు వైనతేయుండు 58

ఆ. ఒకటి గొలనిలోన § నుండు నొక్కటి గొండ,
మీఁద సంచరించు § మీరు రెంటి
నడఁగ నొక్కమాట § యడరి పట్టుట కృత్య,
మనియెదరు వశంబె § యట్లు చేయ 59

వ అనిన నది యట్టిద యుపాయంబు సెప్పెద నాకర్ణింపు మని
యమ్మునివరుండు 60

చ. కరిపతి నీరు ద్రావుటకుఁ
గాఁజను డెంచినఁ గూర్మరాజు సం
గర మొనరించు చుండి తమ
కంబున నీళ్లులఁ బాసి వీఁకమై
దరి నడరంగఁ బట్టు నది
తత్సమయంబున రెంటిఁ గూడ నీ
వెరవున నూఁది చిత్తమున
వేగిరపా టొటు లేక పొంచుమీ 61

వ అని యుపదేశించిన వీడ్కొనుటకు వినతుండయిన తన్ను
నత్యాదరంబునం గనుంగొని యత్తపోధనసత్తముండు నీవు
గజకచ్ఛపంబుల నాహారంబుగాఁ గొనిన నీకుం ద్రిదశాహా
రంబు దేర దొరకొనుటకు సందేహంబు లే దను పలుకు
పలికి పరమాశీర్వాదంబు లిచ్చిన 62

మ. విని యుత్సాహము గండలింపఁగ వియ
ద్వీథీగతుండై విమా
నవికాయంబులు దూలఁ బక్షతివితా
నస్ఫారదీప్తిప్రజం
బినరశ్మిప్రకరంబుఁ గీడ్పఱుపఁబ
క్షీంద్రుండు చంచద్గతిం
జనియెం దా నురగాభిధాన మగునా
శైలంబు వెందిప్పకున్ 63

క. చని యల్పశరీరుండై
తను నెఱుఁగక యుండ వెలఁగి తా నుగ్రగజేం
ద్రునిఁ గాంచి నీరి కది ప్రా,
యినయప్పుడ వెనుకఁ జనియె నెలమి దలిర్పన్ 64

ఉ. దంతి సనంగ భూరిమద
ధారలగాలి యొఱింగి కూర్మము
త్యంతసముద్ధతిం గొలని
కడ్డపడన్ వెస వచ్చె వచ్చినన్
దంతియు నీరువట్టున ను
దగ్రపుఁ గోపము సందడింప దు

ర్థాంతసముద్యమం బెసఁగ
దానిపయిం గవిసెఁ మహాగ్రమై 65

చ కవిసి ఖరంబులై నముని
కాళ్లను వ్రేయఁగ నాము సీరిలో
ను వెడల కుండి కూర్మ మతి
నుస్థిరతీవ్రనఖంబులం బదా
గ్రవిదళనంబు సేయఁగఁ గ
రంబున మోఁదఁగ వారణంబు దం
తవిహతి నొంపఁ గచ్ఛపము
దారుణ మయ్యె రణంబు భూవరా! 66

ఉ ఇమ్మెయిఁ బోరిపోరి మది
నేపును గోపము నగ్గలింపఁ గూ
ర్మమ్ము గడంగి నీర్వెడలి
మత్తకరిఁ వడి నాక్రమింపఁగా
గ్రమ్మన రెంటినిం బొదవి
కచ్ఛపముఁ వలకాల వామపా
దమ్మున వారణంబును ము
దమ్మునఁ బట్టి తగిల్చె గోళ్లులన్ 67

వ ఇట్లు వినతపట్టి వట్టిన నవి దమయంగంబులు వ్రేలం బడ నడిచిపడుటయు నతండు 68

మ వెలుచన్ గోళుల నొత్తి యగ్గజముఁ దాఁ
బేలున్ వసం బేదిమూ
ర్ఛల నొందన్ వెస నెత్తిమేఘయుగళీ
సక్తోల్లసద్గైరికా

చలవై హాయసకేలియో యన నభ
స్సంచారి యై యుబ్బున
గ్గలికఁ దవ్వఁగఁ శాఖ యొక్క-
ఘనవృక్షం బయ్యెడం దోఁచినన్ 69

ఆ దానిమీఁద నుండి § వాని రెంటిని భుజిం,
పంగ మదిఁ దలంచి § పంచయోజ
నములు నిడుపు గల్గు § రమణీయశాఖపై
గరుడుఁ డెలమి నెఱఁగెఁ § గురువరేణ్య! 70

క ఎఱఁగినయప్పను వ్రేఁగున,
విఱుగుటయును శాఖ చూచి § విహగేంద్రుఁడు గొం
దఱు మునుల నందుఁ గన్గొని,
వెఱపున నాత్మీయచిత్త § వృత్తి గలంగన్ 71

తే అవనిఁ బడ నీక శాఖఁ జం § చువున బట్టి
పట్టి వారలసుస్థితుల్ § పల్లటిలక
యుండ వెరపున ధరియించి § యొయ్య నెగయఁ,
జూచి యవ్వాలఖిల్యులు § చోద్య మంది 72

వ వైనతేయుం డగుట మనంబుల ననుసంధించి కరుణించి 73

క. ఈతఁడు దక్కఁగ నొరులకు,
నీతెఱఁగుబలంబు వెరవు § నేల కలుగు నం
చాతరుశాఖ విడిచి చని,
రాతని దీవించి యోగ్య § మయ్యెడు నెడకున్. 74

వ చనినఁ గరుత్మంతుండు సంతోషించెఁ దదనంతరంబ 75

ఆ విపులశాఖ నిచట § విడిచిన నిచ్చటి
జంతుకులము లెల్లఁ § జచ్చు నింక

నేమి సేయువాఁడనే నను నెవ్వగ,
పుట్టె నవ్విహంగపుంగవునకు 76

వ అట్టియెడ 77

తే నిందితాచారయుతము పుళిందదేశ
మంబుధిప్రాంత మీశాఖయందు విడువు
మమరవరులపం పిది విహగాధినాథ!
యనుచెలుంగు నభంబునందావహిల్లె 78

క విని సత్వరముగ నటఁ గొని,
చని యద్దేశమునఁ గల్గుజనములు మృతిఁ బొం
ద నతం డాచక్కటి నా,
ఘనశాఖయు నెమ్మనంబుకలఁకయు విడిచెన్ 79

వ విడిచి భరితలీలంబుగా నొక్కశైలంబు విశాలతటంబున
కుం బోయి 80

క కరికచ్ఛపములపెన్నె,
త్తురుఁ గండలుఁ గ్రొవ్వు మెదడుఁ దుష్టిగఁ బక్షీ
శ్వరుఁ డాని యధికబలబం,
ధురుఁడై యమృతమున కేఁగె దుర్దాంతగతిన్ 81

వ. ఇవ్విధంబున 82

క చని దానిచుట్టు మండెడు,
ననలంబును జూచి తత్సహోత్తరజిహ్వల్
దనికిన నెఱకలు గమరునో,
యనుతలఁపున బ్రహ్మఁ గానరిగె రయమునన్ 83

వ అరిగి తచ్చరణంబులకుం బ్రణతుఁడై కేలు మొగిచి 84

చ. వినతకు దాస్య మొందె నొక
వెంటఁ దదీయనిరాసహేతువై
యనఘవిచార ! నాకు నమృ
తాహరణంబు విధేయ మయ్యె న
ప్పనిమెయి నగ్నిచేత నగుఁ
బాటగునన్నెఱతో భవద్దయా
వననిధి నాశ్రయించుటకు
వచ్చితి నార్తశరణ్య ! కావవే 85

వ. అనుటయు 86

చ అతనికి వత్సలుం డగుట
నంబుజగర్భుఁడు వెన్నవైపయిన్
వితతము గాఁగ జిహ్వలకు
వేఁగగునట్లుగఁ జాలవైచినం
బతగవరేణ్య ! మ్రక్కఁబడుఁ
బావకుఁ డయ్యెడఁ జొచ్చి నీదువాం
ఛితము ఫలింప సత్వరతఁ
జేకొను మయ్యమృతంబు నావుడున్ 87

ఆ. ఆత్మఁ బొంగి మ్రొక్కి యతఁ డాలమందలు,
పరపు లైనయెడల కేరిగి యరిగి
కొండయంత వెన్న కూర్చి వేగమ కొని,
పోయి యమ్మహాగ్నిఁ బొదియవైచి 88

శా. నీరుం బాయఁగఁ జల్లి రాక్షసులయు
న్మేషంబు మర్దించి హ్రా

త్సారోదారుఁ డయోమయం బయినయ
జ్వాలంబు వే వ్రచ్చి దు
ర్వారస్వైరవిహార మొప్ప నమృత
గ్రాహం బొడంగూడుడుం
దారావీథిఁ జనం దొడంగె మగుడఁ
దర్పం బెలర్పఁ వడిఁ 89

# భాగవతము

## దశమస్కంధము

### (10) సత్యభామ చేసిన యుద్ధము

మ. బలవంతుండు ధరాసుతుండు గనె శుం
భద్రాజబింబోపరి
స్థలశంపాన్వితమేఘమో యనఖగేం
ద్రస్కంధపీఠంబుపై
లలనారత్నముఁ గూడి సంగర కథా
లాపంబులం జేయును
జ్వలనీలాంగుఁ గనన్నిషంగుఁ గుహనా
చంగుర్ రణాభంగునిన్ 1

వ. కని కలహంబునకు నరకాసురుండు గమకింపం దమకింపక
విలోకించి సంభ్రమంబున 2

శా. వేణిం జొల్లెము వెట్టి సంఘటితనీ
వీబంధయై భూషణ
శ్రేణిం దాల్చి ముఖేందుమండలమరీ
చీజాలము ల్పర్వఁగాఁ
బాణిం బయ్యెదఁ జక్కఁగాఁ దుఱిమి శుం
భద్వీరసంరంభయై
యేణీలోచన లేచి నిల్చెఁ దనప్రా
ణేశాగ్రభాగంబునన్. 3

క జన్యంబున దనుజుని దా,
ర్జన్యము లుడుపంగఁ గోరి చను దెంచిన సా
జన్యవతిఁ జూచి యదుతా,
జన్యశ్రేష్ఠుండు సరస సల్లాపములన్ 4

క లేమా! దనుజుల గెలువఁగ,
లేమా నీ వేల గడఁగి లేచితి విటు రా
లే మాను మానవేనియు,
లే మావి ల్లందికొనుము లీలం గేలన్. 5

వ అని పలికి 6

క హరిణాక్షికి హరి యొసఁగెను,
సురనికరోల్లాసనమును శూరకరోరా
సురసైన్యత్రాసనమును,
బరగర్వనిరాసనమును బాణాసనమున్ 7

శా ఆవి ల్లంది బలంబు నొంది తదగ
ణ్యానంత తేజోవిశే
షావిర్భూతమహాప్రతాపమునవీ
రాలోకదుర్లోకయై
తా వేగన్ సగుణంబు చేసె ధనువుం
దన్వంగి దైత్యాంగనా
గ్రీవాసంఘము నిర్గుణంబుగ రణ
క్రీడామహోత్కంఠతోన్ 8

క నారి మొఱయించె రిపుసే,
నారింఖణ హేతు వైన నాదము నిగుడ

న్నారీమణి బలసంప,
న్నారీభాదికము మూర్ఛనంద నరేంద్రా! 9

సీ. సౌవర్ణకంకణఝుణఝుణ నినదంబు,
శింజినీరవముతోఁ జెలిమిసేయఁ
దాటంకమణిగణధగధగదీప్తులు,
గండమండలరుచు ల్గప్పికొనఁగ,
ధవళతరాపాంగధళధళరోచులు,
బాణజాలప్రభాపటలి నడఁప
శరపాతఘుమఘుమశబ్దంబు పరిపంథి,
సైనికకలకలస్వనము లుడుప

తే. వీరశృంగారభయరౌద్రవిస్మయములు,
గలసి భామిని యయ్యోనోకాక యనఁగ
నిషువుఁ దొడుపుట దివుచుటయేయు టెల్ల,
నెఱుఁగరా కుండ నవిఁ జేసె నిందువదన 10

మ. పరుఁ జూచున్ వరుఁ జూచునొంప నలరిం
పన్ రోషరాగోదయా
విరతభ్రూకుటిమందహాసములతో
వీరంబు శృంగారము
న్జరగ న్గన్నులఁ గెంపు సొంపు బరఁగ
న్జండాస్త్రసందోహము
న్సరసాలోకసమూహము న్నెఱపుచున్
జంద్రాస్య హేలాగతిన్ 11

మ. అలినీలాలక చూడ నొప్పెసఁగెఁ బ్ర
త్యాలీఢపాదంబుతో

నలిక స్వేదవికీర్ణ కాలకలతో
నాకర్ణి కానీతస
ల్లలితజ్యానఖపుంఖదీధితులతో
లక్ష్యావలోకంబుతో
వలయాకారధనుర్విముక్తవిశిఖ
వ్రాతాహతారాతి యై 12

సీ. బొమ్మ పెండ్లిండ్లకుఁ బో నొల్ల ననుబాల,
రణరంగమున కెల్లు రాఁదలంచె
మగవారిఁ గనినఁ దా మునుఁగుఁ జేరెడునింతి,
పగవారి గెల్వ నేపగిదిఁ జాలెఁ
బసిఁడియుయ్యాల నెక్కభయ మందుభీరువు,
ఖగపతిస్కంధ మేపగిది నెక్కె
సఖుల కోలాహలస్వనము లోర్వనికన్య,
పటహాభాంకృతుల కెబ్భంగి నోర్చె

ఆ. నీలకంఠములకు నృత్యంబు గఱపుచు,
నలసి తలఁగి పోవు నవలరుఁబోఁడి
యేవిధమున నుండె నెలమి నాజిధాత్రి,
మానములను రిపులమాన మడఁప 13

సీ. వీణెఁ జక్కఁగఁ బట్టువెరవెఱుంగనిముద్దు,
బాణాసనం బెట్లు పట్టనేర్చె
వ్రేఁకునఁ దీఁగెఁ గూర్పంగనేరనిలేమ,
గుణము నేక్రియ ధనుఃకోటిఁ గూర్చె
సరసముత్యము గ్రువ్వఁజాలనియబల యే,
నిపుణత సంధించెవిశితశరముఁ

జిలుకకుఁ బద్యంబు సెప్ప నేరనితన్వి,
యస్త్రమంత్రము లెన్నఁ డభ్యసించెఁ
ఆ బలుకు మనినఁ బెక్కు పలుకనిముగుద యే,
గతి నొనర్చె సింహగర్జనములు
ననఁగ మెఱసెఁ ద్విజగదభిరామ గుణధామ,
చారుసత్యభామ సత్యభామ 14

శా జ్యావల్లీధ్వని గర్జనంబుగ సుర
ల్సారంగయూథంబుగా
నావి ల్లింద్రశరాసనంబుగ సరో
జాక్షుండు మేఘంబుగాఁ
దా విద్యుల్లతభంగి నింతి సురజి
ద్దావాగ్నిమగ్నంబుగాఁ
బ్రావృట్కాలము సేసె బాణచయమం
భశ్శీకరశ్రేణిగాన్ 15

సీ రాకేందుబింబమై రవిబింబమై యొప్పు,
నీరజాతేక్షణ నెమ్మొగంబు
కందర్పకేతువై ఘనధూమకేతువై,
యలరుఁ బూఁబోఁడిచేలాంచలంబు
భావజుపరిధియై ప్రళయార్కపరిధియై
మెఱయు నాకృష్టమై మెలఁతచాప
మమృతప్రవాహమై యనలసందోహమై,
తనరారు నింతిసందర్శనంబు
ఆ హర్షదాయియై మహారోషదాయియై,
పఱచు ముద్దరాలిబాణవృష్టి

హరికి నరికిఁ జూడ ¶ నందంద శృంగార
వీరరసము లోలి ¶ వి స్తరిల్ల 16

వ. ఇవ్విధంబున. 17

క. కంపాలతికలబెడిదపు
టంపఱచే ఘోరదానవానీకంబుల్
వెంపఱ సన్నాహంబుల
సొం పఱ భానుతుని వెనుకఁ జొచ్చె న్విచ్చెన్ 18

వ. అయ్యవసరంబునం గంసహారి మనోహారిణిం జూచి సంతో
షకారియు గరుణారసావలోకన ప్రసారియు మధురవచన
సుధారసవిసారియుం దదీయసమరసన్నాహనివారియు నై
యి ట్లనియె 19

క కొమ్మా దానవనాథుని,
కొ మ్మాహవమునకుఁ దొలఁగె ¶ గురువిజయముఁ గై
కొమ్మా మెచ్చితి నిచ్చెదఁ,
గొ మ్మాభరణములు నీవు ¶ గోరిన వెల్ల న్ 20

వ అని పలికి సమ్మానరూపంబులును మోహనదీపంబులును
దూరీకృత విశ్లేషంబులు నైనసల్లాపంబులం గళావతిం
దద్దయుఁ బెద్దజేకంబు చేసి తత్కరకిసలయోల్లసితబాణాస
నంబు మరల నందుకొనియె 21

---

## (11) నృ గ చ రి త్ర

సీ ధరణీశ ! యొకనాఁడు ¶ హరితనూజులు రతీ,
శ్వర సాంబ గద చారు ¶ చారుభాను

లాదిగా యదుకుమారావలి యుద్యాన,
వనమున కతివైభవమున నేఁగి
వల నొప్ప నిచ్ఛానువర్తులై సుఖలీలఁ,
జరియించి ఘనపిపాసలను బొంది
నెఱిఁ దప్పి సలిల మన్వేషించుచును వేగ,
వచ్చుచో నొకచోట వారిరహిత
తే కూపమును నందులో నొకకొండవ్రాలె,
విపులమగు మేనియూసరవెల్లిఁ గాంచి
చిత్తమున విస్మయం బందితత్తరమున,
దాని వెడలించువేడుకదగులుటయును 1

చ పరువిడి పోయి తెచ్చి ఘన
పాశచయంబుల నంటఁగట్టి య
గ్గురుభుజు లందఱుం గదిసి
కోయని యార్చుచు దాని నెమ్మెయిన్
దరలఁగఁ దీయలేక దగ
దట్టముగా మది దుట్టగిల్ల నొం
డొరుఁ గడవంగ వే చని ప
యోరుహనాభున కంత చెప్పినన్ 2

చ విని సరసీరుహాక్షుఁ డతి
విస్మితుఁడై జలశూన్యకూప మ
ల్లనఁ గదియంగ నేఁగి కృక
లాసము నొక్కతృణంబపోలె గొ
బ్బున వెడలించె వామకర
ము న్గలిఁ జొన్పి య దంతలోనఁ గాం

చనరుచిమేను గల్గి పురు
షత్వముతోఁ బొడసూపి నిల్చినన్ 3

వ ఇట్లు నిల్చినం జూచి కృష్ణుం డతనివృత్తాంతం బంతయు నె
ఱింగియు నక్కడిజనంబును గుమారవర్గంబును దెలియ
కొఱకు నతనిచేతన తద్వృత్తాంతం బంతయు నెఱింగించు
వాఁడై యి ట్లనియె 4

చ కనదురురత్నభూషణని
కాయుఁడవై మహనీయమూర్తి వై
యనుపమకీర్తిశోభితుఁడ
వై విలసిల్లుచు ధాత్రిమీఁదఁ బెం
పొనరిననీకు నేమిగతి
నూసరవెల్లి తనంబు చొప్పడెన్
విన నిది చోద్య మయ్యె నువి
వేకచరిత్ర! యెఱుంగఁ జెప్పుమా 5

క అని యడిగిన మురరిపుపద,
వనజమ్ములు తనకిరీటవరమణు లొఱయన్
వినయమున మ్రొక్కి యి ట్లను,
ఘనమోదముతోడ నిటలఘటితాంజలి యై 6

గీ విశ్వసంవేద్య! మహిత! యీవిశ్వమందుఁ,
బ్రకటముగ నీ వెఱుంగని దొకటి కలదె?
యైన నాచేత విన నిష్ట మయ్యెనేని,
యవధరింపుము వినిపింతు నంబుజాక్ష! 7

శా ఏ నిక్ష్వాకుతనూజుఁడ న్నృగుఁడను నా
నేపారుభూలుఁడన్

దీన వ్రాతము నర్థిఁ బ్రోచుచు ధరి
త్రీ నాయకుల్ కొల్చి సం
మానింపం జతురంతభూభరణ సా
మర్థ్యుండ నై సంతతి
శ్రీనిండారినవాఁడ సల్లలితకీ
ర్తి స్ఫూర్తి శోభిల్లఁగన్ 8

చ పలుకులఁ దన్నుఁ దాఁ బొగడఁ
బాతకమౌదు రటుండఁ దారకా
వలి సిక్తావజంబు హిమ
వారి కణంబులు లెక్కవెట్టఁగా
నలవడుఁ గాని, నేను వసు
ధామరకోటికి దానమిచ్చు గో
వుల గణుతింప ధాతయును
నోపఁడు మాధవ ! యేమి సెప్పుదున్ 9

వ. అదియునుం గాక 10

చ పొలుచుసువర్ణశృంగఖుర
ము ల్దనరం దొలుచూలులై సువ
త్సలుగల పాఁడియావుల ను
దాత్త తపోవ్రత వేదపారముల్
గలిగి కుటుంబులై విహిత
కర్మములం జరియించునట్టి వి
ప్రులకు సదక్షిణంబుగ వి
భూతి దలిర్పగ నిత్తు నచ్యుతా ! 11

వ. మఱియు న్యాయసముపార్జితవిత్తమ్ముల గోభూహిరణ్య రత్న
నివాస రథ హస్తి వాజి కన్యా సరస్వతీ వస్త్ర తిల కాంచ
న రజత శయ్యాది బహువిధదానంబు లనూనంబుగ ననే
కంబులు సేసితిఁ బంచమహాయజ్ఞంబు లొనరించితి **వాపీ**
కూప తటాక వన నిర్మాణంబులు సేయించితి నివ్విధంబునఁ
జేయుచో నొక్కనాఁడు **12**

క. అనఘాత్మ! కశ్యపాఖ్యుం
డనువిప్రున కే నకల్మషాత్ముఁడనై యి
చ్చిన గోవు దప్పి నామం,
దనె కలసినఁ దెలియ లేక తగ నాగోవున్ **13**

క. ఒండొక భూమీసురకుల,
మండనునకు దాన మీయ మసలక యావి
ప్రుం డాగోవుం గొని చను,
చుండన్ మును ధారఁ గొన్న యుర్వీసురుఁడున్ **14**

క. మది రోష మొదవ దోవతి,
వదలిన బిగియించుకొనుచు వడిఁ జని యిది నా
మొదవు నడివీథి దొంగిలి,
వదలక కొనిపోయె దిట్టవారుం గలరే! **15**

చ. అనవుడు నాతఁ డిట్లనియె నాతనితో నిపుడేను దీని నీ
జనపతిచేత ధారఁ గొని సాధుగతిం జన నీది యంట యె
ట్లనిన నతండు నేనును ధరాధిపుచే మును ధారఁ గొన్న **యా**
వని వినిపింప నిద్దఱకు నయ్యె నపారవివాద మచ్చటన్ **16**

వ. ఇట్లు విప్రులిద్దఱుం దమలోన నంతకంతకు మచ్చరంబునం
బెచ్చు పెరిఁగి కలహించి నాయున్న యెడకుం జనుదెంచి

మున్ను నాచేతం గోదానంబుఁ గొన్న బ్రాహ్మణుం డి
ట్లనియె 17

సీ. మనుజేంద్ర! ప్రజ లధర్మప్రవర్తనముల,
నడవ కుండఁగ నాజ్ఞ నడపు దీవు
మనమున నే ధర్మమని యాచరించితి,
మును నాకు నిచ్చిన మొదవు దప్పి
వచ్చి నీమందలోఁ జొచ్చిన నిప్పుడీ,
భూసురునకు ధారఁ బోసి యిచ్చి
తగవు మాలితి నీవు దాతవు నపహర్త,
వైన నిన్నే మనఁ నవనినాథ!

తే. యనినమాటలు చెవుల సోఁకినఁ గలంగి,
భూసురోత్తమ! యజ్ఞానపూర్వకముగ
నిట్టిపాతక మొఱసె నేనెఱిఁగి సేయఁ,
గొనుము నీ కత్తు నొకలక్ష గోధనంబు 18

క. అని మఱియును నవ్విప్రుని,
సునయోక్తుల ననునయించుచును నిట్లంటిన్
ననుఁ గావు నరకకూపం
బునఁ బడఁగాఁ జాలఁ బురుషపుంగవ! యనినన్ 19

గీ. ఎంత వేఁడిన మత్సరం బంత పెరిఁగి,
మొదల నా కిచ్చినట్టియ మొద వెకాని
యొసయు నీరాజ్య మంతయు నిచ్చితేని,
యొల్ల నని విప్రుఁ డచ్చటనుండ కరిగె 20

వ. అట్లతం డరిగిన నారెండవ బ్రాహ్మణుం బ్రార్థించిన నతం
డును జలంబు డింపక పదివేలేరికొోరు పాఁడి మొదవుల నిచ్చిన

నైనను దీనిన కాని యొల్ల ఁని నిలువక చనియె నంత్యఁ
గాలపరిపక్వంబైన నన్ను దండధరకింకరులు కొనిపోయి
వైవస్వతు ముందరం బెట్టిన నతండు నన్ను నుద్దేశించి
యిట్లనియె 21

మ. మనుజేంద్రోత్తమ! వంశపావన! జగ
న్మాన్యక్రియాచార! నీ
ఘనదానక్రతుధర్మముల్ త్రిభువన
ఖ్యాతంబులై చెల్లెడిన్
మును దుష్కర్మఫలంబు నొంది పిదపం
బుణ్యానుబంధంబులై
చనుసౌఖ్యంబులఁ బొందు పద్మజనియా
జ్ఞఁ ద్రోవఁగా వచ్చునే 22

వ. అని వేగంబునఁ ద్రోపించిన నే నపుడ పుడమింబడి యీని
కృష్టంబైన యూసరవెల్లిరూపంబుఁ గైకొంటి నింతకాలంబు
తద్దోషనిమిత్తంబున నిద్దురవస్థం బొందవలసెఁ బ్రాణులకుఁ
బుణ్యపాపంబు లనుభావ్యంబుల యూరక పోనేరవు నేఁడు
సమస్త దురితనిస్తారకం బయినభవదీయపాదారవిందసంద
ర్శనంబునం జేసి యీఘోరదుర్దశలం బాసి నిర్మలాత్మ
కుండ నైతి నని పునఃపునఃప్రణామంబు లాచరించి మఱి
యు నిట్లనియె 23

గీ. కృష్ణ! వాసుదేవ! కేశవ! పరమాత్మ!
యప్రమేయ! వరద! హరి! ముకుంద!
నిన్నుఁ జూడఁ గంటి నీకృపఁ గనుఁగొంటి,
నఖిలసౌఖ్యపదవు లందఁ గంటి 24

వ. అని యనేకభంగులం గొనియాడి గోవిందునిపదంబులు తన
కిరీటంబు సోఁకం బ్రణమిల్లి దేవా! భవదీయపాదారవిం
దంబులు నాహృదయారవిందంబునం బాయ కుండునట్లుగాఁ
బ్రసాదింపవే యని తదనుజ్ఞాతుండయి యచ్చటి జనం
బులు సూచి యద్భుతానందం బొంద నతుల తేజోవిరాజితం
బైనదివ్యవిమానమం దాసీనుండై దివంబున కరిగె 25

---

# భాస్కర రామాయణము.

## సు ం ద ర కా ం డ ము.

---

### (12) లంకాదహనము

క. అమరులు బెగడఁగ గగనాం,
తమునం బఱతెంచి వాయుతనయుని నయ్య
స్త్రము బంధింపఁగ జవస,
త్త్వము లెడలి విచేష్టుఁ డగుచు ధరణిం గూలెన్ 1

సీ. అటు గూలి తెప్పిఱి హనుమంతుఁ డక్షైన,
బంధంబు బ్రహ్మాస్త్రబంధ మగుటఁ
దనలో నెఱిఁగి మున్ను దన కబ్జగర్భుండు,
వలఁతియై యిచ్చిన వరముఁ దలఁచి
బ్రహ్మేంద్రమారుత పాలితుం డగునాకు,
నీయస్త్ర బంధంబు పాయు టెంత ?
యని యాత్మ నిరతి బ్రహ్మాస్త్ర మంత్రధ్యాన,
ము నొనర్చి బంధవిముక్తుఁ డగుచు

తే. నజునియానతియును గొంత యనుసరించి,
రాక్షసులు పట్టుకొని పోవ రాక్షసేంద్రు
నొద్ద కేఁగి యతనితోడ నొనరం మాట,
లాడి మాచెదఁ గాక యం చలరుచుండ. 2

క అలుకను రక్కసు లందఱు,
బలువిడి వెఱతెంచి చూచి భర్జించుచు క్రో
కులఁ బావనిఘనసంధులు,
బలువుగ బంధించి పట్టి పై పైఁ దివియన్ 3

వ పావనియు రావణదర్శనకుతూహలుం డగుటయు 4

క తనబంధ మూఁడు టెఱిఁగియుఁ,
గనుకని రక్కసులచేతఁ గొగట్టుల సంత
ర్జనముల నాటులఁ బోటులఁ,
బెను భర్జనపడుచు నధికభీతుఁడపోలెన్ 5

వ. ఉన్నహనుమంతుం గనుంగొని యితం డప్పుడ బ్రహ్మాస్త్ర
బంధ విముక్తుం డైనవాఁ డనుచు నింద్రజి త్తాశ్చర్య
వ్రీడావిషాదంబులు పెనంగొన నంతరంగంబున 6

ఉ అక్కట యిట్టిలోకభయ
దాస్త్రముచేతన జిక్కఁడయ్యె వీఁ
డిక్కపి కన్యసాయకము
లెంత తలంపఁగ నంచు లజ్జ నా
రక్కసుఁ డాసమీరసుతు
రావణునొద్దకు మున్ను రక్కసు
ల్గ్రిక్కన గట్టినట్టి పెడ
కట్టులతోడన తెచ్చి పెట్టినన్ 7

వ. అప్పు డుగ్రాకారులై ముఖంబులఁ గోపంబులు ముడివడ
హనుమంతుం గనుంగొని 8

ఉ ఎక్కడిమర్కటుండో తను
నెవ్వఁడు పంచెనో యేమి సేయఁగా
నిక్కడ వచ్చినాఁడో నధి
యింతము కాల్తము మొత్తిపుత్త మం
చెక్కుడుకిన్క రాత్రిచరు
లిందును నందును బట్టి యీడ్చుచున్
స్రుక్కఁగ వ్రేయుచుం బొడుచు
చు న్నిరసించుచు నుండ నయ్యెడన్ 9

క రక్షోనాయకుఁ డుద్ధతి,
వృక్షచరప్రవరు రోషవిస్ఫారిత తా
మ్రాక్షులతోఁ గడుఁ గిన్క,
న్వీక్షించె నతండు నాత్మవిస్మితుఁ డగుచున్ 10

సీ తపనీయభూషణోదంచితరోచులు,
సౌదామనులమాడ్కిఁ జాల మిగుల
రమణీయతనులిప్తరక్తచందనచర్చ,
కలితసంధ్యారాగకాంతి నెనయ
మకుటనానారత్నమణిగణదీధితు,
ల్పర్జన్యకార్ముకప్రభల నీన
భూరివక్షంబునఁబొల్చుహారశ్రేణి,
లలితబలాకాళిచెలువు నొలయ

తే భయదహుంకృతి గర్జలపగిదిఁ జెలఁగ
మేచకాభ్రంబుకైపడిమేను వెలుఁగ
దృష్టి కక్కజ మారెడుతేజ మెసఁగ,
వాఁడిమగఁటిమితోఁ గడువ్రాలుమహిమ 11

మ పటువిస్ఫూర్జితపంక్తిమస్తకమణి
ప్రస్ఫారబాహాగ్రుఁడుం
గుటిలభ్రూకుటిభీమధూమచటుల
క్రూరస్ఫులింగచ్ఛటో
ద్భటరోషాగ్నిశిఖాకులేక్షణుఁడుఁ బ్రో
ద్దష్టప్రపలాంబోష్ఠవి
స్ఫుటదంష్ట్రాళికరాళవక్త్రుఁడును జ
త్పుర్భీకరాకారుఁడున్ 12

ఉ హాటకశైలశృంగసము
దంచితజూటుఁడు రత్నచిత్రిత
స్ఫాటికభాసురావనుఁడుఁ
జారుదుకూలసమావృతుండునై
జోటులు కంకణక్వణన
శోభితపాణులు చేరి చామర
ల్బాటిగ వీవఁ బ్రాభవవి
లాససమున్నతుఁ లొప్ప నొప్పుచున్ 13

వ నానారత్నచిత్రితంబును గాంచనమయంబును నైన యాస్థా
నంబునఁ బ్రహస్తప్రముఖులైన మంత్రులు పరివేష్టింప
నమరసేవితుండైన దేవేంద్రునిమాడ్కి దేదీప్యమానుండై
మెఱసియున్న లోకవిద్రావణు రావణుం జూచి జగత్ప్రాణ
తనూభవుం డచ్చెరు వందుచు నంతరంగంబున 14

క. ఈరూపము నీఘనభుజ,
సారము నీధృతియు నిట్టిసౌందర్యము వి

స్ఫారోదారగుణంబులు,
నీరాక్షసవిభునిశౌర్యకేమి ట్లొప్పెడునే ? 15

క పాతకవ ర్తియు రాక్షస,
జాతుఁడుఁ గాకుండ నేని కే శక్రాదిసుర
వ్రాతంబున కధిపతి యై,
యీతఁడు లోకంబు లెల్ల కేనేలం దగఁడే ? 16

వ అని విచారించువృక్షచరుని రోషతామ్రాక్షుం డగుచు
నిరీక్షించి రాక్షసచక్రవర్తి ప్రహస్తున కి ట్లనియె. 17

క నిను నెవ్వఁడు పుత్తెంచెను,
వన మేటికిఁ జెఱిచి తీవు కే వడి రాక్షసభం
జన మేల చేసి తెవ్వఁడ,
వని యడుగుము నావుడుం బ్రహస్తుం డతనిన్ 18

క కనుఁగొని తేజము చూడఁగ,
వనచరమాత్రుఁడవు కావు కే వచ్చినపని వం
చన సేయక భయ మందక,
వినిపించిన నిన్ను వేగ కే విడిపింతుఁ దగన్ 19

క సురవరుఁడో దండధరుఁడో,
వరుణుఁడో ధనదుండో దైత్యకేవరుఁడో ని న్నీ
పురి సార దూతగఁ బంపిన,
యురుబలుఁ డెవ్వండో నాకుకేనొప్పుగఁ జెపుమీ 20

వ అనినం బ్రహస్తున కనిలజుం డి ట్లనియె 21

క. హనుమన్నాముఁడ మారుత,
తనయుఁడ రఘురాముదూతఁకేదపనప్రియనం

దనునకు సచివుఁడ నిక్కపు,
వనచరుఁడన్ సీత వెదక వచ్చితి నిటకున్ 22

క దివిజారిదర్శనం బ,
న్యవిధముల న్నాకు దొరుకదని వనభంగం
బు వడిం జేసితిఁ జేసితి,
బవరము నారక్షకబలములతోడన్ 23

చ కరము విరించిచే వరముఁ గాంచిననన్ను శరంబులన్సురా
సురులకుఁ గట్ట రాదవుటఁ జూ శరముక్తుఁడనైతి లోకభీ
కరు దశకంఠు నొండుగతిఁ గాన నశక్యము గాన రాక్షసో
త్కరములచేతఁ గట్టువడి కన్గొను వేడుకతోడ వచ్చితిన్ 24

వ అని పలికి రావణుం గనుంగొని 25

క ఇనజుఁడు నీతోఁ బుట్టువు,
నినుఁ గుశలం బడుగు మనియె నృపతియు రవినం
దనుఁడును నీకు సుబుద్ధులు,
దనరంగాఁ జెప్పు మనిరి తగవున నీవున్ 26

వ వినుము దశరథుం డను రాజేంద్రుని తనయుండు రామ
చంద్రుండు సీతాలక్ష్మణ సమేతుండై తండ్రియానతిని వన
వాసంబున కేతెంచి దండకారణ్యంబున దర్పితులైన ఖర
దూషణాదులం దునిమి యచటం దనపత్నిం గోల్పోయి
యనుజుండుం దాను నెల్లదిక్కుల వెదకుచు ఋశ్యమూకం
బుఁ జేరి యచ్చట సుగ్రీవునితో సఖ్యంబు సేసి యతనికి
ప్రియంబుగా వాలిం దునిమి తద్రాజ్యంబున కధిపుంగా
సుగ్రీవుం బట్టంబుగట్టి సీతాన్వేషణంబు సేయింపు మనిన

సుగ్రీవుండును గరుడానిలవేగులు మహాసత్త్వసంపన్నులు నగు ననేక బలీముఖకోట్ల సర్వలోకంబుల వెదకి సీత నరసి రం డని పనిచె, నేనును రాఘవసుగ్రీవుల యానతిని సముద్రం బవలీల దాఁటి లంకాపురి సొచ్చి యంతట వెదకి యయ్యశోకవనికా మధ్యంబున నున్న జనకరాజనందనం గాంచితి ధర్మవిరుద్ధంబును గులనాశకంబు నగుపరదారాపహరణంబు నీయట్టి బుద్ధిమంతులు గావింతురే ? ధర్మశీలుండగువాఁడు సూ యనపాయసుఖంబు లనుభవించు నీవు పరకాంతం దెచ్చి వాఁపంబున కొడిగట్టి చెడ నున్నాఁడ వని పల్కి మఱియు 27

సీ. చరణాగ్రమున నీభుజాదర్ప మడఁచిన,
ధూర్జటివిలు లీలఁ ద్రుంచివైచె
వాలపాశంబునఁ బడి నిన్నుఁ గట్టిన,
వాలి నొక్కమ్మునఁ గూల నేసె
నని నిన్నుఁ జెఱఁగొన్న యర్జునుఁ బోరిగొన్న,
పరశురాముని నాజిభంగపఱిచెఁ
గడిమిమై నొక్కఁడ ఖరదూషణాదులఁ,
బదునాల్గువేవురఁ బాఱిసమరె

తే. నమ్మహాధనుర్ధరున కెగ్గాచరించి
హరిహర బ్రహ్మశక్రాదు లైన నతని
భయదనిర్ఘాత సంఘాత పాతశాత,
బాణఘాతహతులు గాక బ్రతుకఁ గలరె ? 28

ఉ. ఉరవడి రాఘవప్రస్త్రతతు
లుగ్రతరార్చులు మింట నంట నీ
కరము లురంబు నంగములుఁ
గంఠము లాస్యము లంఘ్రులూరులున్
శిరములు మర్మము ల్పరులుఁ
జించుచుఁ ద్రుంచుచు నుచ్చి పాఱుచు
న్మరియలు సేయుచు న్నిగుడ
మూఁడుజగంబులు నాఁప నోపునే? 29

శా. శ్రేణీభూతములై దిగంతము లధిక్షేపించు సౌమిత్రిదో
స్స్థానోగ్రోత్థితరత్నపుంఖగణనోద్భూతస్ఫులింగచ్ఛటా
క్షీణజ్వాలధురీణబాణములు వర్షింపంగ నీ వేల స
త్ప్రాణత్రాణశరీరులై నిలుతురే బ్రహ్మాదులు న్మందటన్ 30

మ. తురగస్యందనమత్తనామజభట
స్తోమంబుతోఁ గూడ నీ
పురి భస్మంబుగఁ గాల్చి సైనికసుహృ
త్పుత్రానుజశ్రేణి నె
త్తురు గ్రక్కం బడ గ్రుద్దిచంపి మఱి మృ
త్యుక్రూరతం బట్టి నీ
శిరము ల్డుంపఁగ నేన చాలుదు జయ
శ్రీలబ్ధి వర్ధిల్లఁగన్ 31

క. సుగ్రీవాదుల యెదుట ను
దగ్రత నినుఁ ద్రుంతు నంచు నాడినరఘువీ
రాగ్రణి ప్రతిజ్ఞకతన ద
శగ్రీవుఁడ! బ్రదికి తీవు చావక నాచేన్. 32

ఆ. అజునివరము నీకు నమరగంధర్వాసు
రాహియక్షరాక్షసాలిచేత
మడియ కుండఁగాని మనుజవానరులచేఁ
గలనఁ జావకుండఁ గాదు వినుము 33

క. ఘనుఁడగు రాముఁడు మనుజుం
డినజుఁడు వానరుఁడు గాన నియ్యిరువురచే
ననిఁ జావఁగలవాఁడవు
మనమున నామాట నమ్ము మతికరి వగుచున్. 34

శా. నీకంఠార్పితకాలపాశము శిరో నిర్ఘాతపాతంబు లం
కాకస్సంచయకాళరాత్రి గళబ ద్ధోదగ్రకాలాహి క
న్యాకారాగతమృత్యు వాజనకక న్య స్వేగ సర్పించి లో
కైకత్రాణుని రామునిం గనుము నీ కాబుద్ధి గాకుండినన్.

క. సీతారాముల కోప
స్ఫీతానలశిఖలఁ గలయఁ జేర్చుచు లంకా
భూతవ్రాతము భస్మీ,
భూతము గావించు ననుడుఁ బోడమిన కిన్కన్ 36

మ. కుటిలభ్రూకుటిభీమఫాలదశక
క్రూరోరునాసాపుటో
ద్భటలంబోష్ఠ హనుప్రకంపన నట
ద్దంష్ట్రాతిఘోరాస్యుఁడై
పటుదృష్టి స్ఫుట విస్ఫులింగములు పైఁ
బైఁ గ్రమ్మ నీకష్టమ
ర్కటునిం జంపుఁడు నా విభీషణుఁడు ధ
ర్మం బాప్ప లంకేశుతోన్ 37

శా ఈకోపంబున కగ్నియో వరుణుఁడో
యీశానుఁడో వాయువో
నాకాధీశుఁడో యక్షనాయకుఁడో కీ
నాశుండో కోణేశుఁడో
యీకీశాధముఁ డెంతవాఁ డరయ వీఁ
డెయ్యోగ్గు నేమాడిన
న్నీకు న్వధ్యుఁడు గాఁడు సైఁపు మదిలో
నీ వింక లంకేశ్వరా! 38

క దూతకు వధకంబెఁ గశా,
ఘాతము ముండనము సంగకర్తనమును న
త్యాతతదండము లెందును
దూత యవధ్యుఁ డని చెప్పుదురు ధర్మవిదుల్ 39

వ. అని పల్క రావణుండు విభీషణుపల్కు లాదరించి 40

క తరుచరునకు వాలము ప్రియ,
కర మగుటను వీనితోఁక గాలిచి నక్తం
చరు లందఱుఁ జూడఁగ నీ
పురమంతయుఁ గలయఁ ద్రిప్పి పుచ్చుం డనినన్ 41

వ. ఉద్ధతి రణకర్కశు లగురక్కసు లక్కపీంద్రుం గదిసి 42

క హనుమనివాలము పెరుఁగఁగ,
ఘనతరకార్పాసపట్టికాశ్రేణిం జై
కొని నూనెతోడ నానిచి,
యనలం బిడి మండ నూఁదిరార్పులు నిగుడన్. 43

ఉ అప్పుడు శుష్కకాష్ఠనిచ
యాజ్వలితాగ్నిసమప్రదీప్తుఁడై

యొప్పుచుఁ గీలజాలకలి
తోన్నతవాలము రాక్షసాలిపై
నిప్పులు రాలఁ ద్రిప్పుచును
నిండినసందడి వాయఁ జూఁడుచుం
దప్పక పౌరు లోలిఁ దనుఁ
దద్దయు విస్మయ మంది చూడఁగన్ 44

క రోమాంచావృతతను వు,
ద్దామా భ్రమభంగి మొఱయఁ దత్కీలోద్య
ద్భీమతరవాల మురుసా,
దామనిగతిఁ దనరఁ దనరితరుచరుఁ డాత్మన్ 45

క ఈకట్లు ద్రెంచుకొని యీ
నాకారులఁ జంపునపుడు నానారక్షో
నీకంబులు గల వేఁగతిఁ
జేకొని కడ లేనిరణముఁ జేయుదు నింకన్ 46

వ కొంతతడ వేమైనం జేయ నిమ్ము సైరించెద మున్ను రాత్రి కానం జూడఁజొప్పడ దీలంకాపురంబునం గల యశేషవిశేషంబులు దివాసమయంబున నీరక్కసులు త్రిప్పికొనం బోయి చూచెదం గాక యనుచుండ నంతలోఁ గాలకింకర భయంకరాకారు లగురాక్షసకింకరులు బలువిడిం గవిసి. 47

ఉ ఉరవడి శంఖకాహళము
లూఁదుచు దిక్కులు వ్రయ్య నార్చుచున్
బెరసి మృదంగనిస్సహాణ
భేరులు ఘోషిల వ్రేయుచున్ భుజో

ద్ధురబలుఁ డైన వాయుసుతుఁ
దోరపుమ్రోకుల బల్విగా మద
ద్విరదముఁ బోలెఁ గట్టికొని
వీథులఁ ద్రిప్పఁగఁ జూచి రక్కసుల్. 48

క. చని సీతో భాషించిన,
వనచరునిం బట్టి తోఁక వడిఁ గాలిచి యం
గన! పురిఁ ద్రిప్పుచు నున్నా,
రనవుడు నాపల్కు శస్త్రహతిగతిఁ దాఁకన్ 49

వ. సీత యతిదుఃఖాక్రాంత యై యత్యంతనిష్ఠ నగ్ని దేవు నుద్దేశించి 50

సీ. నాజీవితేశుఁడు నావగ లుడుపంగ,
వడి సముద్రము దాఁటివచ్చు నేని
పతికృతజ్ఞుఁడు సత్యభాషావిశేషుండు,
సతిపుణ్యచారిత్రుఁ డయ్యె నేని
గురుకులశుశ్రూష కోరి చేయుదు నేని,
యఖిలసన్నుతసాధ్వి నైతి నేని
తపము సేయుదు నేని దమశమాన్వితనేని,
నియతశీలవ్రత నిత్య నేని

తే. వెలయ భాగ్యవిశేషముల్ గలుగు నేని,
నీవు నాపయి సత్కృపాన్వితుఁడ వేని
పరఁగ నగ్నిదేవుఁడ! రామభక్తుఁ డైన
మారుతాత్మజునకు శైత్యకారి వగుము 51

క. అని జనకజ యనలప్రా,
ర్థన సేయఁగ ముందటం బ్రదక్షిణశిఖ లే

పుర నగరయుఁ బ్రజ్వలించుచు,
దనలుఁడు హనుమంతునకు హిమాంశుం డయ్యెన్ 52

క. అనమెడ వాలాగ్రంబునఁ,
నాయతగతి మండుచున్న § యయ్యనలము ప్రా
లేయకరాశ్రయ శీతల,
మై యుండుటఁ గురుదు నొంది § యనిలజుఁ డాత్మన్ 53

క. రామునిన మహ్యముచే నో,
భూమిజపాతివ్రత్యముచే నో § పొందుగఁ బవనో
ద్దామునకు హితయముచే నో,
నా మేను సోఁకదు పీయకనలత్రవశిఖల్ 54

వ. అనుచు సంతోషించి మహోత్సాహంబున 55

చ. బలుపుగఁ దగ్గ సుద్దిగిచి
పట్టిన పాశము లెల్లఁ ద్రుంచి రోఁ
చలఘుభయంబుతోఁ నగసి
యార్చుచు గోపుర మెక్కి యచ్చటం
గలువిడి సూక్ష్మగాత్రుఁ డయి
బంధము లన్నియు నూడ్చి యున్నతా
చలఘన దేహ మొప్పటవి
శాలముగా ధరియించి యేపునన్ 56

క. మును దోరణమునఁ బెట్టిన,
ఘనతరపరిఘంబు లీలఁ § గ్రాలఁగఁ గేలం
గొని తనుఁ బట్టినదనుజుల,
మునుకొని పడి కేలఁ గూల § మోఁది వధించెన్ 57

ద్రవిణతనుత్రశాలలను
రావణుపట్టపుసర్వశాలలన్ 62

వ. అనుచుఁ గలవరించుచుఁ బౌరు లిట్టట్టును బఱవం జొచ్చిరి 63

---

## యుద్ధకాండము.

### (13) విభీషణువిషాదము

చ. రణమునఁ గొండవ్రాలె రఘు
రామశరంబునఁ గూలియున్న రా
వణుఁ గని శోక వేగఘన
వారినిధు ల్తను ముంప నావిభీ
షణుఁ డతిదీనుఁడై యడలు
సైఁచఁగ జాలక చేరవచ్చి తత్
క్షణము వినన్నె నోచుఁ బలు
చందముల న్విలపించె నేడ్చుచున్ 1

శా. అన్నా! యోధశిరోమణీ! ఘోరసమర
వ్యాపారనిత్యోత్సవం
పన్నత్వంబున రూఢి కెక్కి విలస
ద్బాహాబలప్రౌఢిచే
నౌన్నత్యంబున మించి దైవగతిఁ దృ
ట్యచ్ఛిన్నమై నేఁడు వి
చ్ఛిన్నా శేషశిరస్కరుండ వయి హా!
సీదద్గతిం దూలితే. 2

మ సురలక్ష్మీకచకర్షణప్రవణము
ల్బుంభద్రదణోత్సిక్తముల్
హరశైలోద్ధరణప్రచండబలము
ల్హార్యక్షదుస్సాధముల్
హరిదంతద్విరదేంద్రదంతదళన
వ్యాపారఘోరంబులుం
గరమై యున్న భవత్కరంబులు పతం
గశ్రేణిపా లయ్యెనే ? 3

క సురతరుకుసుమశ్రేణీ,
సురుచిరమృదుతల్పమధ్యశోభిత మగునీ
యురుతరదేహం బిప్పుడు,
పరుసని సంగ్రామభూమిఁ బడఁ బా లయ్యెన్. 4

గీ అర్కమండలతులితంబు లై విపక్ష,
తిమిరజాలకభేదనక్షమము లైన
విమలదీధితిమణికిరీటములు నేఁడు,
సడలి యంతంత నుగ్గులై పుడమిఁ గూలె 5

క. ఎనసినగురువిక్రమమున,
ఘనతరభుజరాజిస త్త్వగౌరవమున న
త్యనుపముఁ డగు నీతో నెన,
యనఁ జాలినవారు జగములందును గలరే 6

సీ. నయశాలివై యుండి నరనాథసుందరిఁ
దెచ్చి యీయాపదఁ దెచ్చుకొంటి
వల దని చెప్పినఁ జలమున నీభంగి
నామాట లేమియు నమ్మవైతి

మనువంశనాథుని ¶ మనుజుఁగాఁదలఁపక
భూమినందన నిచ్చి ¶ పుచ్చవైతి
రామునితోడివై ¶ రస్థితి నేప్రొద్దు
మాను మన్నను నీవు ¶ మానవైతి
తే నీతి హితములు సేకొన ¶ నేరవైతి,
తెలిపి చెప్పినఁ గ్రొవ్వునఁ ¶ దెలియవైతి
చెడుట నిక్కువ మన్నను ¶ నుడుగవైతి,
తెగువ నాగ్రహబుద్ధియు ¶ దింపవైతి 7

క పరకాంతలు తల్లులు గా,
నిరవారఁగఁ దలఁపకున్నఁ ¶ నిహముం బరమ
దొరకొనునె మేలు గలుగునె,
దొర యంద్రే వాని బుధులు ¶ దుష్టుం డన రే! 8

క ఘనతరదుర్మానముచే,
ననయంబును గలుగునీస్వ ¶ యంకృతదోషం
బున నింత పుట్టె నేఁ జె,
ప్పినపలుకులు దప్పవయ్యెఁ ¶ బిదప నరసినన్ 9

క. అని శోకించుచుఁ దాలిమి,
మనమున నెలకొనమిఁ జేసి ¶ మానము దూలన్
ఘనమూర్ఛ మునుఁగుఁ దెలియక
దనుజేశుఁడు శోకవహ్ని ¶ తప్తాత్ముం డై. 10

క ఇనుఁడు ధరఁ బడియెఁ జంద్రుఁడు,
మునిఁగెం దిమిరమున నగ్ని ¶ మొగి హిమ మయ్యెన్
గనకాద్రి యొరఁగె ననుక్రియ,
దనుజాధిప ! పొలిసి తిట్లు ¶ దర్పము దూలన్ 11

శా. సారస్కంధము శౌర్యమూలము విరా
జద్బాహుశాఖంబు దు
ర్వారోదారధృతిప్రవాళ మతిదీ
వ్యత్కోపపుష్పంబు శ్రీ
పారంభైకఫలంబు నై పరఁగుదై
త్యాధీశవృక్షంబు దా
నీయూపంబున రామహస్తి విఱిచెన్
హేలాసముల్లాసియై 12

చ. కరయుగదంతిదుర్జయము
గర్వమదాంధము ఘోరచాపదు
ర్భరకరదుస్సహాక్రమముఁ
బద్మజవంశసముద్భవంబు ని
ర్జరతరుషండఖండనవి
శాలతరం బగు దైత్యరాజసిం
ధురపతిఁ గూల్చె రాముఁ డను
దుర్జయసింహము బాణదంష్ట్రయై 13

ఆ. నిబిడవిక్రమార్చి నిశ్వాసధూమంబు,
సాహసేంధనంబు సత్త్వతాప
మయినరావణాగ్ని యారామజలదంబు,
చేత నార్పఁబడుట సిద్ధ మయ్యె 14

—(०)—

# హరివంశము.

## ఉత్తరభాగము ఆ 2.

---

(14) బలరామవ్రజగమనము

క. తమపిన్న నాఁటియాటల,
క్రమ మంతయుఁ దలఁచి వేడ్కఁ గడలుకొనఁగఁ జి
త్తమునందు గోకులంబుకున్,
కమలాక్షు ననుమతి మిచ్ఛగించి కేరి మిష్టమునన్ 1

మ. జలజాతేక్షణుతోఁ జెప్పి తడను
జ్ఞం దా నొకండుం జనుము
జ్వలకాంతారవిహారయోగ్య మగు వే
షం బొప్ప బ్రేషల్లెకుఁ
లలితమై నేఁగినఁ గన్నవాసులు మహో
ల్లాసాత్ములై యమ్మహా
బలు సంతెంత నెదుర్కొనంగ సతిఁగుఁ
బంధుత్వధౌరేయతన్ 2

క. కొందఱకు మ్రొక్కి తనకుం,
గొందఱు మ్రొక్కంగ వరుసఁ గొందఱఁ గుశలం
బందంద యడిగి కౌఁగిటఁ,
గొందఱఁ గదియించి ప్రణయకోవిదుఁ డగుచున్ 3

క. గోపికలు పాదవికొనఁగాఁ,
గీవ రెడుచూడ్కితోడఁ దిన్నని యుచితా

లాపములఁ బ్రియము సలుపుచు,
నాపోవనియీాపుసాంపు కై లభినవములుగ కే 4

వ ఉన్నంత నోపవృద్ధు లందఱు పతినిఁ బరివేష్టించి యిష్ట
గోష్ఠిం దగిలి యి ట్లనిరి 5

క. స్వాగతమే యాదవకుల
రాగవివర్ధన ! సుహృత్ప ! శ్రీరామ ! సుఖశ్రీ
భాగి నిను నిపుడు గని సుఖ
భాగుల మే మైతి మెట్టికైభాగ్యోదయమో ! 6

చ తమతమజన్మదేశములు
తద్దయు రమ్యము లెట్టిస్వాశ్రిా
తములకు నంటు యిప్పుడు గ
వా నిజ మయ్యె జగత్ప్రసిద్ధవి
క్రముఁడవు నీవు నీపనుఁ
గాంచిన నోటిక వచ్చి యిమ్మెయిన్
సుమాఁ గొనియాడ నిరిఁ గడు
మాన్యుల మైతిమి దేవతాళిక 7

సీ చెనఁటి చాణూరు ముష్టికుల భంజించుటం,
కంసుని బరిమార్చి కీర్తి పడించి
తనరుట శత్రునికరంబుఁ బ్రతిష్ఠించు,
టబ్ధిలోఁ గమితోడికయాహవంబు
గోమంతనగమున శ్రీ మెఱయంగ ను,
దాత్తదివ్యాయుధాకవా ప్తిమహిమ
భూమీశ్వరులతోడికభూరిసంగ్రామంబు,
కరవీరవిభుని సృకగాలుఁ గూల్చు

తే. టర్థి మకుర కేతెంచుటొ యచటఁ జిత్ర
జయమునఁ గ్రమ్మఱఁ గొనుట యాశ్రిసరణ నీవు
తమ్ముఁడును జరించినయద్భుతంపుఁ జరిత
మెన్నఁ గొనియాడ నెవ్వరి మిష్ప డేము 8

క. ఈవసుమతి యంతియు నిటు,
మీవలనఁ బ్రతిష్ఠ నడసె మీవా రగువా
రేవారు నారు కల్యా,
ణావాసులు దార యగుట యరిదియె యనఘా! 9

చ. అన విని రాముఁ డిట్లనియె
నక్కట యిఁక తనేల మీరు గూ
ర్మి నెఱయఁ బెంపఁగాఁ బెరిఁగి
మించినశిక్షఁ బరించి మీగృహం
బున సరసాన్నము ల్గుడిచి
బుద్ధిఁ దనర్చినమాకు నెందు శో
భనమగు సామి సందియము
శాంధవ్యు లెవ్వగు మిమ్ముఁ బోలఁగన్ 10

క. రాచసిరి యుండియు న్నది,
యాచవికిం జొరదు నాకు హరిఁ నిచట శా
ల్యాచరణములై మక్కున,
యేచందంబులను మఱవ నెన్నఁడు రామిన్ 11

వ. అనిన సంతసిల్లి వారందఱు నతని నభినందించి మాధుర్య హృద్యంబులగు మద్యంబులును, సమధికాపేక్ష్యంబులగు భక్ష్యంబులును, భావానురూపంబులగు ననులేపంబులును, జేతోవిలోచనకల్యంబు లగు మాల్యంబులును, ననేకంబు

లోకకల్యాణమూర్తికి సమర్పించినం బ్రీతుండై వివిక్తంబు
రమణీయంబు నగు ప్రదేశంబున 12

ఉ. గోపిక లంది యీఁ బసిఁడి
కోర నుదారసుగంధిశీధు వి
చ్ఛాపరిపూర్తిగాఁ గొని వె
సం గడు నుగ్గడు వై మదంబు స
వ్యాపకభంగి నంగము స
మస్తము ఘూర్ణన మొందఁ జేయ ను
ద్దీపిత మైన మోహము మ
దిం బరితంత్రత యావహింపఁగన్. 13

సీ. కనకపుఁబ్రోకునఁ దనరెడుసురదంతి,
మాడ్కి నుత్ఫుల్లదాక్షమున నమరి
నిండువెన్నెల పస్వే జెఱయుకైలాసాద్రి,
తెఱఁగునఁ జాదనదీప్తి మెఱసి
చలదుల్కమగుశిరోజ్జ్వలదంబుప్రక్రియఁ జేక,
కుండలమణిదీప్తి కొమరు మిగిలి
ఘనభోగియుక్తమై తనరుపటీరంబు,
గతిఁ జేతిహాలము నతిశయిల్లి
తే. తారకలలోఁ గలంకవిస్ఫురఁ డగుచు
సలరుపూర్ణేందువిధమున నతినపిండు
వడమ నీలాంబరద్యుతి బెడఁగు గాఁగ
నధికధవళాంగరుచి నొప్ప నవ్విభుండు. 14

---

## (15) స్కందకృష్ణులయుద్ధము

క. హరుఁ బరుగుఁగాక యసురే,
శ్వరరక్షణ మింకఁ దొలఁగఁగ వచ్చునె నాకున్
హరి నొడుతుఁ బొడుతు మగఁటిమి,
యరుదుగ నని కార్తికేయుఁ డనికిం గడఁగెన్ **1**

వ. ఇట్లు కుంభాండప్రహితం బగురథంబుతోడ నడరి యతండు **2**

ఉ. దానవకోటి యుబ్బ విన
తాసుతుమేనును గృష్ణుమేను న
త్యూనునిమేను ముష్టికని
షూదనుమేనును వాలురంపపె
న్సోనల ముంచి సాంద్రతర
శోణితధారలు ధాత్రి నించెఁ
దా నొక చేతకుఁ సమవి
ధానము లేక మురారి ధీరతన్ **3**

వ. ఒక్కింత సైరించి శార్ఙ్గనిర్ముక్తశరంబు లాశరజన్ముపై నిగిడింప రౌహిణేయ రౌక్మిణేయులును సాయకసహస్రంబులం బరఁగించి రమ్మువ్వురు మూఁడగ్నుల తెఱంగున మహాతేజంబు సూపి మహాసేను తేజంబు మట్టువడం బేర్చినం గోపించి కుమారుండు **4**

చ. జగముల నేర్చు నాఁటిరవి
చాడ్పున దుస్సహదీప్తిచండమై
నెగడి సమస్తశాత్రవవి
నిర్మథనోత్సవసాధనం బనం

బ్రగుణవిభూతిఁ బెంపెసఁగు
బ్రహ్మశిరం బనునాయకంబు న
న్నగధరుమీఁద నేయ గగ
నంబున నిండె సురాస్త్రనాదముల్ 5

మ. హరి యాలోన సమాహితాత్ముఁ డయి స
ర్వాస్త్రానమర్ద క్రియా
పరుషోపక్రమమైన చక్రము నతి
స్పర్ధం బ్రయోగింపఁ ద
త్పరిపాతంబునఁ షణ్ముఖాంబకము ని
ష్వస్త్రాభాజాలమై
పరమక్లీబత నొందె మేఘుసటల
ప్రచ్ఛన్నసూర్యాకృతి 6

గీ. బ్రహ్మశిర మివ్విధంబునఁ బ్రతిహతిఁ,
భాన మగుటయు నగ్నినేత్రుఁడు మఱియుఁ
దనకుఁ బ్రియసాధనం బగుకార్ముకశక్తి,
వైచెఁ దడయక హరిఁ గూల్చుకాంక్షఁ బేర్చి 7

మ. చలదుల్కానలమాడ్కి నంకుశశిఖా
జ్వాలాకరాళాకృతిన్
గలఘంటారతి భ్రమియ దిగ్గగనభా
గం బెల్ల నొక్కంతయై
వెలుఁగ న్వచ్చి తదస్త్రముల్ దివి సుర
ల్వీక్షించి విభ్రాంతులై
జలజాతాక్షుదెస న్నిరాశు లయి చే
ష్ట ల్దక్కి రత్యంతమున్ 8

గీ. శక్తి గలవాఁడు కావునఁ శక్తిఁ జేసి,
నచ్చునందాఁక సుస్థిరత్వమునఁ జూచి
చేర రానిచ్చి యుగ్రహస్తాగ్రఘాతమునను,
నిలిపె నుగ లల్పఁ గయ్యాలఘుయశుఁడు — 9

క. అంతట నిలువని మఱియును,
నంతఁ నక్త్రాను కారికయి గుచ్చిన మతిం
దొంతియు నెన గుహవపై వి,
శ్చింతిత నై చుటకఁ జక్కఁ జేతి నమర్చెన్ — 10

సీ. ఆసమయమున నుతహాదేవ్రనుపుఁ,
గాస్తిచైతన్యభాగ మైన
లంకా బిధాన లీలామూర్తి గాంచినా,
భంగాగధితు లెందుఁ బజ్వరిల్ల
నగ్రాయి యై నచ్చి కదన సేనానిక,
ద్దమై నిలువంగ నచ్యుతుండు
నిరిఘుముగ దృష్టిఁ గ్రమ్మజేర్చి యు టేల,
నిశ్చితకార్యంబు నీవు చెఱచి

ఆ. తరట తొలఁగు తొలఁగుమట్లు కాకున్న వి,
శాఖఁ గానుచు వేగఁ జనుము నాసి
యేను జక్రి ముడిపి యుండ యూరకుండితి,
ననిఁ గంత్రెల్లి యన్యథాట — 11

వ. అమ్మహానుభావువలికినయట్ల చేసె — 12

# మార్కండేయపురాణము.

## (16) పాతివ్రత్యమాహాత్మ్యము.

ఉ. దానగజేంద్రభూధరకదంబతురంగతరంగసంఘకాం
తానికరంబరత్నమహితంబయి లక్ష్మికిఁ బుట్టినిల్లనం
గా నభిరామమై భువనగౌరవవైభవయుక్తమై ప్రతి
ష్ఠానపురంబు వెల్చు విలసన్మహిమ న్జలరాశిచాడ్పునన్ 1

వ. అప్పురంబునఁ గౌశికుం డనువిప్రుండు పూర్వజన్మపాపఫలం
బునం జేసి 2

చ. కరచరణాంగుళుల్ ముఱిగి
గాత్రము తద్దయు వ్రస్సి చీము నె
త్తురు దొరఁగంగఁ బెన్మఱికి
దుస్సహమై సుడియంగ ఘుర్ఘుర
స్వర మెసఁగంగ నీఁగ లవి
శంబును జమ్మని మూఁగుచుండ హే
యరసము మూర్తమైనయటు
లాతతికుష్ఠరుజాభిభూతుఁడై 3

చ. అలఁదురుచుండఁగా నతని
యంగన పుణ్యచరిత్ర సాధ్వి స
త్కులజ పతివ్రతాచరణ
కోవిద రూపగుణాభిరామ ని

ర్మలినలతాంగి యాత్మవిభు
మానుగ దైవముగా మనంబున
న్దలఁచుచు నిత్యభక్తిపర
త జ్జను లెల్లను బ్రీతి సేయఁగన్ **4**

చ ఉడుగక నాథుమైఁ దొరఁగు
చుండెడు నెత్తురుఁ జీముఁ బల్మఱుం
గడుగుచు నూనియం దలయుఁ
గాళ్లును జేతులుఁ దోమితోమి యిం
పడరఁగ నీళ్లు లార్చుచుఁ బ్రి
యంబొనఁ జీరలు దాన కట్టుచుం
గుడుపుచుఁ గామభోగములఁ
గోమలి యాతనిఁ బ్రీతుఁ జేయుచున్ **5**

క అతఁ డెంత యలిగి తిట్టిన,
మతిఁ గింకరినడక యెపుడు మాటాటకి యా
నత యగుచు సత్పతివ్రత,
యతని సతిశ్రేష్ఠుఁగాఁగ నాత్మఁ దలఁచుచున్ **6**

వ ఆరాధించుచుండె నొక్కనాఁ డమ్మహీదేవుండు నిజాంగన కి
ట్లనియె **7**

క ఏ నొక గణికారత్నము,
మానుగఁ గనుఁగొంటి రాజమార్గంబున సా
ధ్వీ! నేఁడు వేడ్కయడరెడు,
దానిగృహంబునకు నన్నుఁ దగఁ గొనిపొమ్మా! **8**

ఉ ఆనగుమోముచెన్ను శశి
యందును బంకరుహంబునందు లే

దానయనప్రభాతి మద
    నాస్త్రములందు మెఱుంగులందు లే
దానును మేనికాంతి లతి
    కావలియందుఁ బసిండియందు లే
దానలినాయతాక్షిలలి
    తాకృతి నామదిఁ బాయ నేర్చునే　　9

సీ. మెఱుఁగారు లేఁదీగ। మెచ్చనియ త్తన్వి,
    తనులత చెల్వంబు। గనుఁగొనంగఁ
గలకంఠములయెలుం। గులయేపు దీపించు,
    నలపొత్తిముద్దుఁ। బల్కులు వినంగఁ
గనకకుంభంబుల। కాంతిఁ గైకొనవి యా,
    కాంతచన్గవ బిగ్గఁ। గాఁగిలింపఁ
జిగురుటాకులనను। జిగిసొంపు దెగడున,
    చ్చపలాక్షి కెమ్మోవి। చవిగొనంగఁ
ఆ. జిత్త మొదవుఁ దివుటఁ। జిడిముడిపడియెడు,
నీవు ధర్మతత్త్వ। నిపుణహృదయ
వాలతాంగి నన్నుఁ। ననురక్తిమైఁ గూర్పు,
మన్మథాగ్ని నేను। మ్రందకుండ　　10

క. ఇనుఁ డస్తమించెఁ జీఁకటి,
యును మొగులును నడ్డగించె। నుగ్మలి నాకుం
జన శక్తి లేదు దర్పకు,
ననర్గళాస్త్రములు నెఱఁకు। లాడెడుఁ దోడ్తోన్.　　11

చ అని మదనాతురుం డగుని
జాధిపు చెప్పినమాట యేర్పడ
న్విని వినయమ్ము భక్తియు వి
వేకముఁ బ్రీతియు నగ్గలింప న
వ్వనిత కడు న్బ్రయత్నమున
వల్వ దృఢంబుగఁ గట్టి లంజెకు
న్దన మొదువంగఁ బుచ్చికొని
నాథుని మూఁపునఁ దాల్చి చెచ్చెరన్. 12

చ తఱచయి నీలనీరదవి
తానము పైఁబయిఁ గప్పి యెంతయు
న్మెఱవఁగ నేలయు న్దిశలు
నింగియు నిండఁగఁ బర్వ చాలఁ గ్రి
క్కిఱిసినచిమ్మచీఁకటి ని
జేశ్వరుకోర్కి యొనర్ప వేడ్క న
త్తెఱవ గృహంబు వెల్వడి య
తిత్వరితంబుగ నేఁగుచుండఁగన్. 13

వ. మార్గంబున నేక నొక్కయెడ 14

ఆ క్రుచ్చుగాఁ దలంచి కె చెచ్చెర నారెకు
ల్పట్టి తెచ్చి కొఱుతఁ కె బెట్టినట్టి
మహితపుణ్యుఁడైన కె మాండవ్యుఁడను ద్విజో
త్తమునియెడమమూఁపుఁ కె దాఁకె బెట్టు. 15

తే. తాఁకుటయు మేను గదలి వేదనభరంబు
క్రొత్త యగుటయు నమ్మునీంద్రుండు గనలి

నన్ను నిట్లు నొప్పించిన నరుఁడు సూర్యో
దుదయ మగుటయు మరణంబు నొందుఁగాత 16

—{ పతివ్రతాశాపమువలన సూర్యోదయాభావము. దానిచే లోకోపద్రవమును }—

చ. అని ముని శాప మిచ్చుటయు
నావనితామణి శోకతప్తయై
యినుఁ డుదయింప మత్పతికి
నెగ్గు ఘటిల్లెడునట్లయేని న
య్యినుఁ డుదయింప కుండు నిఁక
నేను బతివ్రతనైన నన్న న
య్యినుఁ డుదయింప నోడెఁ విను
మిట్టివ సుమ్ము సతీప్రభావముల్ 17

వ. అంతం ద్రియామ బహుయామమై వర్తింపం దొడంగిన జగంబులు సంక్షుభితంబు లయ్యె నప్పుడు సురలెల్ల భయంబున సురజ్యేష్ఠుం గానం జని యప్పతివ్రతామహానుభావంబు నెఱింగించి యిట్లనిరి 18

సీ. ఆదిత్యుఁ డుదయాస్తమయములు లేకున్కిఁ
జేసి కాలంబులు చిక్కువడియె
సముదినస్నానసంధ్యాజపమహోమాది
వివిధకర్మంబులు విరతిఁ బొందె
వేదాధ్యయనములు విధివిహితస్వధా
స్వాహాదు లొగి నిలువంగఁబడియె
నిత్యనైమిత్తికకృత్యము లుడుగుటను సురా
తిథిపూజ లడఁగె ధాత్రీతలమున

తే నెలమి నేము హవిర్భాగకములు పరిగ్ర
హించి యాప్యాయనముఁ బొంది కి యాశ్రితార్థ
ములును సస్యసమృద్ధియు కి వెలయ నరుల
కొసఁగుటలు దప్పె జగముల కి కొదవ లెగడు. 19

వ లోకవ్యవహారంబులు విచ్ఛిన్నంబు లయ్యె నింక దివసో
త్పత్తి యేవిధంబున నగు నని విన్నవించిన విరించి యిట్ల
నియె. వినుఁ డాపతివ్రతామాహాత్మ్యంబు పతివ్రతచేత నే
కాని చక్కంబడదు గావునఁ బరమపతివ్రతయుఁ దపస్వి
నియు నైన యత్రిభార్య ననసూయ నిక్కార్యంబు సక్కం
బెట్టు మని ప్రార్థింపుఁ డనిన నమరు లాపుణ్యవతికడ కరిగి
బహువిధంబులం బ్రార్థించిరి 20

చ అతులితనిత్యసత్యవతి
యైన పతివ్రతయాజ్ఞ నయ్యహ
ర్పతి యుదయింపమిం గడువి
పద్దశఁ జేట్పడి నిన్నుఁ గాన వ
చ్చితిమి దినంబు మాకు దయ
సేయుము తొల్లిటియట్ల కాఁగ వి
శ్రుతనుచరిత్ర! యన్న నన
సూయ సురావలిఁ జూచి యిట్లనున్. 21

చ అనుపమ మాపతివ్రతమ
హత్త్వము దాని సఫలీకరింప రా
దనిమిషులార! చెప్పెద నుపాయము
చేతఁ దదీయుఁడైన భ

ర్తను దెగకుండఁ జేయుఁడు య
థా స్థితి నుండఁగ నే నొనర్చెద
న్దిన మనినం గరం బలరి దేవత
లట్టుల చేయఁ బూనినన్. 22

—. అనసూయకును, కౌశికపత్నికినిసంవాదము :—

వ. అనసూయాదేవియు దేవగణసహితయై యాపతివ్రతారత్నం
బుసదనంబున కరిగి దానిసేమం బడిగి యి ట్లనియె 23

క. దేవతలకంటె నధికం
గా వల్లభు మదిఁ దలంచి కల్యాణీ! సం
భావింతె యతనివదన
శ్రీవిభవము సూచి సంతసిల్లుదె యెపుడున్. 24

క పతిశుశ్రూషణమున నే
సతులఫలప్రాప్త నైతి నభిమతఫలముల్
పతిశుశ్రూషానియతిని
సతతముఁ బడయంగ వచ్చు సతులకు సాధ్వీ! 25

మ వ్రతము ల్మంత్రజపోపవాసములుతీ
ర్థస్నానము ల్యజ్ఞదా
నతపఃకర్మము లాచరించుచును నా
నాభంగుల న్నిత్యము
న్బతి యాయాససహిష్ణుఁడై కడఁగి సం
పాదించుపుణ్యంబులో
సతి శుశ్రూషలఁ గైకొను న్సగమెయుఁ దా
సాఁబాలు ధర స్థితిన్. 26

తే. స్త్రీజనంబుల కుపవాసతీర్థదాన
దేవపూజావ్రతాదులు తెరువు వలదు
పతిసమారాధనవ్రతపరతఁ జేసి
సుగతి వారికిఁ దంగెటిజున్ను సుమ్ము 27

ఉ. నీ పతిధన్యురాలవు వి
నీతవు పుణ్యచరిత్ర వెంతయు
దైవముకంటె నెక్కుడుగఁ
దత్పరతం బతి గారవింతు పూ
జావినయోపచారముల
సంతతముం బరితుష్టఁ జేయు దీ
భూవలయంబున న్సతులు
పోలరు నిన్నుఁ బతివ్రతామణీ ! 28

చ అని యిటు లత్రిపత్ని ప్రియ
మారఁగఁ బల్కినపల్కు కౌశికాం
గన విని ప్రీతిఁ జిత్తము వి
కాసము నొందఁగ నీయనుగ్రహం
బునఁ గృతకృత్యనై యమర
పుంగవదర్శనయోగ్య నైతి న
న్ననిశము భర్తృభక్తినియ
తాత్మకఁగా నొనరింపు భామిని!' 29

క అని పలికి యాసతి మదీ
యనిలయమున కేఁగుదెంచి తత్త్వాదరణం
బున నీవు నీకు నేనే
పనిసేయుదుఁ నర్థిఁ జెప్పు భవ్యచరిత్రా!' 30

వ. అని యడిగిన నప్పతివ్రతకు ననసూయ యిట్లనియె 31

తే. ఇనుఁడు నీయాజ్ఞ నుదయింప కునికి నిపుడు
సృష్టిఁ జీఁకటి గవియుటఁ జేసి తలఁకి
నిన్నుఁ బ్రార్థించు మని సుర లన్ను వేఁడి
కొనిన వచ్చితి నీకడ కనఘచరిత ! 32

వ. వినుము దివాభాగంబున నిఖిలకర్మనాశనంబును గర్మనాశనంబునఁ ద్రివిష్టపవాసులకుం బుష్టిహీనతయు దాన ననావృష్టియు నగు ననావృష్టిదోషంబున జగంబు నశియించుం గావున నీవు దేవహితార్థంబుగాఁ బూర్వప్రకారంబునం బ్రభాకరవర్తనంబు చెల్ల ననుగ్రహించి లోకంబు లుద్ధరింపు మనిన నప్పతివ్రత యిట్లనియె 33

క మాండవ్యుఁడు మద్వల్లభుఁ
జండాంశుఁడు పొడుచుటయును జాఁగలఁ డని తాఁ
జండతరశాప మిచ్చుటఁ
జండాంశునిపొడుపు నాకసంమత మతివా! 34

తే అనిన ననసూయ యిట్లను విను పతివ్ర
తాంగనలపెంపు నాచేత నతిశయిల్లు
మగువ ! నీపతి మృతుఁడైన మగుడ నతని
జిరతరాయుస్సమేతునిఁ జేయుదాన 35

తే అనినఁ బ్రియ మంది యాతపస్విని గరాంబు
జములు మొగిడించి భక్తిఁ జిత్తమునఁ దనర
నోదివాకర! నిత్యసత్యోర్జితవ్రతాత్మ !
దినమణీ! వేగ నుదయింపు మనియె నని. 36

సీ చుక్కలదీప్తివిస్ఫురణంబు చవిగొని
మిన్నులేఁగెంపున మెఱుఁగువెట్టి
ఘనతిమఃపుంజంబు గనుకనిఁ బోఁదోలి
దిక్కులఁ దేజంబు దీటుకొల్పి
కైరవాకరముల గర్వంబుఁ గబళించి
కమలషండములకుఁ గాంతి యొసఁగి
తిలకోన్నతుహినంబుదప్ప మడంగించి
చక్రవాకముల కుత్సవ మొనర్చి
తే తనసముజ్జ్వలదీప్తితాన మడరి
యఖిలజనులకు ననురాగ మావహింప
నెలమి ననసూయ మహితార్ఘ్య మెత్తి మ్రొక్క-
నుదయగిరిశిఖరంబున నొప్పె నినుఁడు 37

వ పదిరాత్రుల కిట్లు ప్రభాకరుం డుదయించుటయు. 38

క. మునివరునితీవ్రశాపం
బునఁ బ్రాణవిముక్తుఁడై విభుఁడు వ్రాలిన మే
దిని బడకుండ నతని న
వ్వనితామణి పొదివి పట్టె వగ మదిఁ గదురన్. 39

వ. అట్లు మృతుఁడైన నయ్యత్రికళత్రం బప్పరమపతివ్రతం
గనుంగొని 40

క మతి నొక్కింతయు వగవకు,
పతిశుశ్రూషాతపంబుబలమున నే నీ
పతి నిదె మగుడం బడసెద,
నతిరయమునఁ జూడు శుభగుణాన్వితమూర్తిన్. 41

వ అని పలికి 42

**చ.** అనుపమరూపశీల విన
　　　　యాదిగుణంబుల నాదుభర్తతో
నెన యెవరు నేను గాన నను
　　　　నీదృఢసత్యముపేర్మి నీద్విజుం
డనయము లబ్ధజీవుఁడు ని
　　　　రామయుఁడున్ దృఢయౌవనుండునై
వనితయుఁ దాను గూడి శత
　　　　వత్సరము ల్సుఖియించుచుండెడున్. 　　43

**తే.** మనముఁ బలుకును జెయ్వు సమత్వమొందఁ
బతికి శుశ్రూష సతతంబు భక్తిఁ జేయు
దాన నే నైతినేని యీధరణిసురుఁడు
ప్రాణయుతుఁడు గావుత మని పల్కుటయును. 　　44

**ఉ.** ఆవసుధామరుండు విగ
　　　　తామయుఁడు న్నవయౌవనుండు తే
జోవిభవాధికుండు సతి
　　　　సుందరుఁడు న్స్మరసంనిభుండునై
తా వస నుత్థితుం డగుడు
　　　　దైవతసంఘము మెచ్చి సంమద
శ్రీవిధిఁ బుష్పవృష్టిఁ గురి
　　　　సె న్మొరసె న్దివి దేవదుందుభుల్ 　　45

# నృసింహపురాణము

---

### (17) హిరణ్యకశిపుఁడు పెట్టు బాధలు

సీ. వనరాశిజలములు వడిఁ ద్రిప్పుకొనులీలఁ
    గలఁగించు మందరాచలముకరణి
నంబుజప్రియకుముదాప్తులఁ బోరిఁ బట్టి
    బాధించు సింహికాప్రభవుభంగి
ఘనగోత్రగోత్రశృంగంబులు వెసఁ దాఁకి
    పొడిచేయుఁ దీవ్రదంభోళిపగిదిఁ
బ్రబలబలాహక ప్రకరంబు వ్రచ్చి వం
    దఱలాడుఁ బటుమారుతంబుమాడ్కి

గీ. దిగ్గజంబులగుండెలు దిగులుకొల్పు
ఘోరరవమునఁ గ్రూరమృగారిపోల్కిఁ
బ్రకటభుజదర్పమునఁ దన్నుఁ బట్టలేక
దుర్విషహుఁడై హిరణ్యాక్షపూర్వజుండు



సీ. తపములఁ గ్రుస్సినతపసులఁ బట్టి తె
    ప్పించి యచ్చరలతోఁ బెండ్లిసేయు
మోదంబుతో నశ్వముఖుల లాయంబులఁ
    గట్టి చొక్కనియులఁ గవణ మెత్తు
భుజగేశ్వరులశిరంబుల నున్నమణు లూడ్చి
    కొమరార వ్రటువగుండు లెత్తుఁ

జెలఁగి గంధర్వుల§చేతివీణెలు పిశా
చుల కిచ్చి పాడించి § చూచి నవ్వు
గీ ఖడ్గములుఁ బాదుకలు ఘుటి§కములు నపహ
రించి సిద్ధపుంగవుల గా§రించుచుండు
భువనబాధలు దన కిట్లు § ప్రొద్దు వ్రాక
లుగ సురారాతి పేర్చె ను§ల్లోకుఁ డగుచు 2

క సదభిమతము లగుబుక్కల
విదితముగ 'హిరణ్యకశిప§వే స్వాహా' య
న్నదిదక్కమంత్ర మొం డె
య్యదిచొరకుండఁగ సురారి § యాజ్ఞాపించెన్ 3

చ సరసిజసంభవుండు హరి
శర్వుఁ డనంగఁ గలారె వేఱె యొ
క్కరుఁడు జగత్త్రయంబునకుఁ
గర్తయు భర్తయు సంప్రహర్తయుఁ
దిరముగ నేన కాకయని
దేవకులద్విషుఁ డాగమక్రియా
కరులకుఁ దన్నుఁ గొల్వుఁ డని
గర్వమున న్నియమించె నెల్లచోన్ 4

సీ భానుఁ బిల్పించి నా§పంపునఁ బాయక
తెరువరివై మీఁదఁ § దిరుగు మనియెఁ
జంద్రునిఁ బిలిచి నా§శాసనంబున జగం
బున నెల్ల నోషధుల్ § ప్రోవు మనియె
ననిలునిఁ బిలిచి నా§యాజ్ఞఁ బ్రాణుల కెల్ల
వలయుప్రాణంబవై § మెలఁగు మనియె

ననలునిఁ బిలిచి నాయానతియందునఁ
బాచకాదిక భోజమఱపు మనియెఁ

గీ. దనచరిత్రంబె వర్ణింపఁ బనిచె బహువి
ధేతిహాసపురాణార్థజాతి నెల్లఁ
దన్ను వినుతింపఁ బనిచె వేదముల నెల్ల
దైత్యనాయకుఁ డఖిలవిధాయకుండు 5

మ. జముఁడై తాన సమస్తకర్మగతులన్
శాసించు శీతంబు నూ
ష్మము వర్షంబును దాన యయ్యయితఱిన్
సంధిల్లఁగాఁ జేయు న
ర్థముఁ గామంబును దాన కైకొని ప్రమో
దం బందు ధర్మంబు మో
క్షము నాత్మీయ కటాక్షలక్ష్యములన్
గర్వోత్కటస్వాంతుఁడై 6

ఉ. నేలయుఁ గొండలున్ దిశలు
నింగియు దీవులు నంబురాసులున్
గాలములున్ గ్రియావళులు
గాడ్పులు వహ్నులు నాకిమర్త్య పా
తాళములు న్నిజాకృతులు
దాల్చి సరోరుహాసూతిఁ గొల్చున
ట్లాలఘుశీలుఁ గొల్చు సద
యాత్మత యేర్పడ వచ్చునిచ్చలున్ 7

వ. ఇల్లు లోకపరమేశ్వరుం డగునసురేశ్వరుండు నిరంతరైశ్వ
ర్యుండును, గురుభుజవీర్యుండును, దివిజమర్దనకార్యంబులు

నవార్యంబులై చెల్లుచుండఁ జండప్రతాప దీపిత త్రిలోకుం
డగుచు ననేకసంవత్సర సహస్రంబులు సామ్రాజ్యంబు
సేయుచుండ నాఖండలప్రముఖ బృందారకు లందఱు రహ
స్యంబునఁ గూడఁబడి గురునితోఁ గర్తవ్యం బడిగిన నమ్మ
హామతి మరుత్పతి కిట్లనియె 8

క. నీతులచేఁ ద్రోవడు దు
ర్నీతునియుద్రేక మెసఁగి § నిగిడినయెడ లో
కాతిక్రమహేతు వగు న
హేతుకళానాశనంబు § నెమ్మెయిన యగున్ 9

చ. కడిఁదివరంబు వారిరుహ
గర్భునిచేఁ గొనినాఁడు వాఁడు మీ
యెడ ననిశంబుఁ బెన్పగయు
నీసును రోషము నెమ్మనంబులో
జడిగొనియుండుఁ గావున న
సాధ్యుఁ డవధ్యుఁడు దైత్యనాథుఁ డే
వడువునఁ బౌరుషంబుఁ గొని
వాని జయించుట ప్రేగుచూడఁగన్ 10

సీ. సామంబుచే శత్రు § సాధింత మంటిమా,
సామంబు ఖలునందు § సేమ మగునె?
భృత్యులతోఁ దాయ § భేదింత మంటిమా
యసహాయసాహసుం § డసురవరుఁడు
దానంబు విశ్వావి § ధాయక మంటిమా
మొల్ల మెల్లను వాఁడు § కొల్లఁగొనియె

దండితనంబున \ దండింత మంటిమా
చెనసి యజేయు నిర్జింపరాదు

గీ కానఁ జతురుపాయంబులు \ కార్యసిద్ధి,
జనకములు గావు మఱి చూడ \ సంధివిగ్ర
హాదులైన షడ్గుణములు \ సప్రయోజ
నములు పగతుఁడు ఘనుఁడు దుర్గముఁడు గాన **11**

క స్థానంబును వృద్ధియు న
ద్దానవపతియందు సంచితములైనవి దే
వానీకము సంక్షయగత
మైనయది త్రివర్గతత్త్వ \ మారసి చూడన్ **12**

వ స్వామ్యమాత్య సుహృత్కోశ రాష్ట్రదుర్గబలంబులను సప్తాంగంబులను సంపన్నంబులై తదీయ సామ్రాజ్యంబు రిపులకు నభియోగ్యంబు గాకుండుటయు నాకౌకసులకు నమ్మహిమ విదితం బగుటయుఁ బరమేష్ఠిదత్త వరలాభంబు న నుదయోన్ముఖుండై నవాఁడునుం గావున ననురకుం గాల బలంబు సమధికం బగుటయుఁ ద్రిలోకంబులును దనయధీ నంబులుగాఁ గైకొని యున్నవాఁ డగుటంజేసి దేవబలంబు సిద్ధంబగుట యవలంబింప వలయుట నాకుం దోఁచినకర్జం బది యట్లుండ వెండియు నొక్క తెఱంగు చెప్పెద **13**

శా కామక్రోధమదాద్య మైనయసుహృ
ద్వర్గంబులన్ గెల్వ నే
ధీమంతుండు సమర్థుఁ డాతఁడు విరో
. ధివ్రాతమున్ గెల్చు నీ

కామక్రోధమదాదినిర్జితుఁడు దు
ష్కర్ముండు నై యుండు వాఁ
డీమై నెవ్వరిచేత నేనియు రమా
హీనుం డగు౯ వ్రేల్మిడిన్ 14

క అజితాత్ముఁ డైనయాతని
విజయంబును సిరియు ౕ విరియు వేగంబ శర
త్ప్రజనితజలధరములు గడు
నిజము లగునె యంబరమున ౕ నిముసం బై నన్. 15

మ దివిజుం డిప్పుడు కామరోషముల ను
ద్రేకించి లోకంబు దు
స్సితి నొందించుచు నున్నవాఁడు విభవాం
ధీభూతచేతస్కుఁడై
మతిహీనుండునుబోలె సౌఖ్యనిరతి౯
మత్తిల్లి యున్నాఁడు ని
ర్జితుఁ గావింపఁగవచ్చు దైవపరత౯
జేపట్టి యీపాతకు౯ 16

క విజయాభిమానతృప్తు బ
హుజనద్విషుఁ గామసంవృ ౕతోన్మాదు వినో
దజితుని వెసఁ దొడరంగా
విజయం బగు ననిరి నీతి ౕవిస్తరవేదుల్ 17

క తనుఁ గా నెఱుఁగనివానికిఁ
దనుఁదా దండించుకొనని ౕతామసునకు నెం
దును దైవబలములే దిం
త నిరూఢతఁ గనినసిరియు ౕ దవ్వగఁ దోఁచున్. 18

వ మనకు దైవంబు దాతయు వాసుదేవుండ మనకె యననేల యనేక బ్రహ్మాండకోటి జాతంబులైన చరాచర భూతంబులకుఁ బరాయణంబు నారాయణాభిధానం బగు తేజంబ ఈ జగంబుల సంకటం బుడుప నా దేవునకు నపహార్యంబు మన మమ్మహాత్ము శ్రీ పాదపద్మంబులం జేరి మన తెఱఁ గంతయు విన్నవింతము మున్ను చెప్పిన హరి శరణాగతుల యాపదలఁ బాపనోపు నాపురుషుండు మనకు నెయ్యది కర్తవ్యంబుగా నానతిచ్చెఁ దత్ప్రకారంబున నపకారులకుఁ బ్రతీకారంబు సేయుద మిదియ నిశ్చయంబు 19

# బ్రహ్మోత్తరఖండము.

## పంచమాశ్వాసము

---

### (18) అష్టాదశపురాణ రహస్యములు.

ఉ. శ్రీగురుదేవహేళనము
  సేయఁగరాదు పురాణవేద శా
స్త్రాగమ ధర్మము ల్విడువ
  రాదు మహీసుర రాజ దేవతా
జ్ఞాగతి మీఱరా దొగి మృ
  ష ల్వచియింపఁగరాదు నిత్య మ
భ్యాగతపూజ మాని కుడు
  వం జనరాదు నరేంద్రనందనా! 1

క. గురుగోబ్రాహ్మణపూజా
పరత నర్తింపు మెపుడు పరధనములకుం
బరసతుల కాసఁ జెందకు
నిరతసదాచారధర్మనియతుఁడ వగుమీ 2

క. స్నాన జప హోమ తర్పణ
దానములను విప్ర దేవతా గురు పూజా
మానితకార్యములను నీ
మానసమున నలసవృత్తి మానఁగవలయున్ 3

క. కోపము విద్వేషంబును
దాపము నాక్రోశవృత్తి దండమును దురా

లాపంబులు పైశున్యము
పాపవిచారములు విడువు | భద్రగుణాఢ్యా! 4

క నిరతము విషయాసక్త
స్ఫురితమనోవృత్తి సాధ్వ|సూయయు హింసా
పరతయు నాత్మస్తుతియును
బరనింద యొనర్పవలదు | పార్థివతనయా! 5

క అత్యాహార మతిశ్రమ
మత్యాలాపములు | మఱియు నతిశయకోపం
బత్యుత్కట మగు నిద్రయు,
నత్యాకాంక్షయును విడువు | మనవరతంబున్ 6

క జనక శ్వశుర సతీగురు
జననీ బుధభాషణములు | సమ్మద మొప్ప
న్వాని విశ్వాసింపుము మది
ననయము నిష్కపటవచన|మది నమ్మఁదగున్. 7

క కృపణు ననాథుని వృద్ధుల
నపరాధవిహీను బాలు| నబలను భాస్వ
త్కృప వెలయఁగ రక్షింపుము
తపనీయాదికము లొసఁగి|దాక్షిణ్యమునన్ 8

సీ బంధుమిత్రులయెడ|భావంబు నిలుపుము
కృప గల్గియుండు దుః|ఖితులయందు
సజ్జనులందు హ|ర్షంబు గావింపుము,
కుజనుల వీక్షింపు | కోపదృష్టి

శరణాగతుం డైన శత్రువు నైనను
జంపఁగా వలదు నిశ్చయముగాను
నెలమిఁ బాత్రాపాత్రమెవ రైన వేఁడిన
లే దన కిమ్ము దేహాదు లైనఁ

తే. దల్లి తండ్రియు గురుఁడు నందనుఁడు విప్రుఁ
డాచరించినయపరాధ మది సహింపు
మార్తరక్షాపరుండవై యనుదినంబు
నప్రమత్తుండవై యుండు మనఘచరిత 9

క. కీర్తి మహాభూషణ మగుఁ,
గీర్తియ లక్ష్మీకరంబు కృతకృత్యతయుం
గీర్తి శుభం బగుఁ గావునఁ,
గీర్తి యుపార్జింపు మెపుడు కృతపుణ్యుఁడవై 10

హయ గజా శ్వ రత్న హాటకంబులనైన,
నపహరింప ధాత్రి నపయశంబు
విడువవలయు దానిఁ గడు సత్వరంబుగఁ,
దృణముగాఁ దలంచి ధీరవర్య! 11

క. గౌరీశ్వరపదభక్తుల,
నారాధింపుము ప్రసన్ను లగునట్టుగ సం
సారపయోనిధిమగ్నుల,
నారసి వా రుద్ధరింతు రనవరతంబున్ 12

క. ఆయుర్బలధనవిద్యా,
శ్రేయఃకీర్తిప్రతాప శీలంబులు క
ర్మాయత్తత వచ్చినచోఁ,
బాయక యవి యనుభవింపు భవ్యవిచారా! 13

క కాలము దేశము శక్తియుఁ,
దా లెస్సగఁ దెలిసి చేయు కార్యములను నా
ర్యాలోచనపూర్వకముగ,
మేలుగ నెచ్చోట నైన మితహితవచనా 14

క. జపహోమస్నానంబులఁ
దపములఁ బితృకార్యములను దత్పరమతివై
చపలత్వ ముడిగి యుండుము,
కపటం బించుకయు లేక కలుషవిదూరా ! 15

క దాక్షిణ్యసమేతం బ,
ల్పాక్షర మధికార్థ నుశర మతిహృద్యతరం
బక్షిణా మసందిగ్ధము,
దక్షం బగుపలుకుఁ బలుకఁ దగుఁ దథ్యముగన్ 16

క. ఆపదలందును శత్రు,
వ్యాపారములందు భీతి వలవదు నీకున్
బాపములకు గురువిప్రా,
లాపములకు వెఱచి యుండు లాలితబుద్ధిన్ . 17

సీ పరుల నెవ్వరినైన బాధింపకుండుము,
పరులబాధ లడంపు కరుణ వెలయఁ
జోరదుష్టారి నివారణం బొనరింపు,
శాహ్యాగేహనుష్ఠిఁ బరఁగవలదు
బంధుమిత్రజ్ఞాతి భార్యాసుతాతిథి,
భోజనంబుల సమబుద్ధి వగుము
విద్యాకథాధర్మ విహితవాక్యోపదే,
శములందు సతతనిశ్చలుఁడ వగుము

తే ఏస్థలము సాధువిప్రభూ ◊యిష్ట మగును,
బుణ్యతీర్థంబు లెచ్చోట◊బొందియుండు
శివనివాసంబు లేభూమిఁ ◊జెలఁగుచుండు,
నచట నిలువు మవశ్యంబు ◊ హర్ష మొదవ. 18

క కులటావేశ్యాకాముక,
ఖలసంగత దేశముల నొ ◊ కానొక వేళ
న్నిలువకుము జగత్ప్రభు వగు,
నలికాక్షుని మదిఁ దలంపు ◊ మ్రశాంతంబున్. 19

క ఎప్పుడు శాంతియు దాంతియు,
నెప్పుడును శుచివ్రతంబు ◊ లెప్పుడు ధర్మం
బెప్పుడు జితషడ్వర్గత,
దప్పక వర్తింపు మీవు ◊ ధరణీశసుతా! 20

క. యతులకు విప్రులకుఁ బతి,
వ్రతలకు వరధేనువృషభ ◊ రత్నములకుఁ బు
ణ్యాతరునదీనిజగృహాదే,
వతలకు వందన మొనర్పు ◊ వాలాయముగన్. 21

ఆ. భక్ష్యభోజ్యలేహ్య ◊ ఫలపుష్పతాంబూల,
వస్త్రభూషణాది ◊ వస్తువితతి
శివసమర్పితంబుఁ ◊ జేసి యాపిమ్మట,
ననుభవింప వలయు ◊ ననుదినంబు. 22

శా భద్రాచారపరుండ ◊ వై నిరతమున్
బ్రాహ్మీముహూర్తంబున
న్నిద్రాసక్తిఁ ◊ బరిత్యజించి శుచివై
నిష్కల్మషత్వంబునన్

రుద్రాణీరమణుం గృపాగుణసము
　　ద్రుక్ శంకరుక్ శ్రీమహా
రుద్రుం జిత్తమునన్ భజింపు మతిధీ
　　రోదాత్తభావంబునన్ 　　23

ఆ నిర్వికల్పముగను నీ వాచరించిన,
స్నానదానహోమ జపతపములు
ననుదినంబు తత్ఫలాపేక్ష లుడిగి త,
ధ్యముగఁ జేయు మీశ్వరార్పితములు 　　24

చ విహరణ భాషణ శ్రవణ
　　వీక్షణ భోజన పాన దాన సం
గ్రహ శయన స్థలంబులను
　　రాజకళాధరుఁ బార్వతీపతిన్
గుహజనకున్ వృషధ్వజుని
　　గోత్రశరాసను దేవదేవుని
న్నహితవిచార ! నీదుమది
　　మానక నిల్పి భజింపు మేర్పడన్ 　　25

మ వరపంచాక్షరమంత్రపారకులు శై
　　వాచారపారీణు లీ
శ్వరభక్తు ల్భసితత్రిపుండ్రవిల స
　　త్ఫాలప్రదేశాంచితు
ల్గురురుద్రాక్షమణిప్రదీప్తకరయు
　　గ్ముల్పూజ్యులై నట్టియా
పురుషశ్రేష్ఠులు నిల్చియుందు రెపుడున్
　　భూతేశులోకంబునన్ 　　26

వ. అని చెప్పి, వత్సా ! యివ్విధంబున ననేకపురాణంబులయందు విస్తరింపంబడిన ధర్మసంగ్రహంబు లన్నియు సంక్షేపరూపంబున నీకుం దెలియ ననుగ్రహించితి 27

---

### (19) శ్రద్ధాభక్తులను గూర్చిన యితిహాసము

క. శ్రద్ధయె లోకహితం బగు,
శ్రద్ధయె నిజజనని పగిది సౌఖ్యము లొసఁగున్
శ్రద్ధాపరుల నభీష్టస
మృద్ధులఁ గాఁ జేయు చుందు రెల్లనుపర్వల్ 1

శా. శ్రద్ధాభక్తిసమేతులై విబుధులన్
సంప్రీతిఁ బూజించిన
న్సిద్ధించు న్నిజకామితార్థములు
నిశ్శ్రేయఃపదప్రాప్తియున్
శ్రద్ధాహీనుల పూజ వంధ్యతరువు
ష్ప్రాయమై యిష్టసం
సిద్ధిం జేయదు సర్వమానవులకున్
సిద్ధంబు ధాత్రీస్థలిన్ 2

ఆ. ఓమహాత్ములార! యుపదేశమునకన్న,
శ్రద్ధ గలిగి యునికి సిద్ధి దనరు
నిమ్మహార్థమునకు నితిహాస మొక్కటి,
విన్నవింతు వినుఁడు వీను లలర 3

క. ప్రాంచద్వీపులసరస్వ,
త్కాంచీస్థలి వెలయునట్టి ఘనతరబహుళ

ట్పాంచాళద్విషయములం,
శాంచాల మనంగ నొక్కశప త్తన మలరున్ 4

మ అనిశం బప్పర మేలు ఖండిత సమ
స్తారాతిసంఘాతుఁడై
హనుమత్కేతుఁడు విక్రమస్ఫురణ మా
నాభ్యున్నతి న్మారుతా
శనరాశ్కేతుఁడు సత్కృపారసమునన్
సర్వారికేతుండు భూ
జనవిఖ్యాతుఁడు సింహకేతుఁ డను
రాజశ్రేష్ఠుఁ డుదగ్రసన్మతిన్ 5

ఉ సారబలాఢ్యుఁ డానృపతి
చంద్రునకున్ బ్రభవించె వైరిసం
హారుఁడు దుర్జయుం డనుకు
మారుఁడు శౌర్యకుమారుఁ డర్థిమం
దారుఁడు శైలజాధిపప
దాబ్జవిచారుఁడు సింధురాజగం
భీరుఁడు మేరుధీరుఁ డర
విందశరోపమసుందరాంగుఁ డై 6

వ అంత 7

క జననాథనందనుం డొక,
దినమున మృగయాభికాంక్ష దీపింప ధను
స్సు నిశితబాణధరుం డై,
చనియెం గాంతారమునకు శబరులు గొలువన్ 8

వ. ఇవ్విధంబున నమ్మహారణ్యంబుఁ బ్రవేశించి యచ్చటం బఱ
తెంచు వేదండ గండక పుండరీక భల్లూక వరాహ మహి
షాది దుష్టమృగంబుల విదళించుచు విహరించుచున్న సమ
యంబునఁ దద్భటుం డైన యొకశబరుండు చండకుం డను
వాఁడు మృగయాన్వేషణపరుం డై వనంబునం దిరుగుచు
నొక్కయెడ జీర్ణంబై న దేవాలయమునందు స్ఫుటితం బైన
లింగంబుఁ గాంచి దైవనియోగంబున దానిం గొనివచ్చి
యారాజనందనునకుం జూపి యిమ్మహాలింగంబున కేను
బూజనం బొనరంచెద దీనిం బూఁజించువిధానం బెట్టిది సవి
స్తరంబుగా నానతీయ వలయు నని ప్రార్థించిన శబరునకుఁ
బరిహాసముగా నారాజకుమారుం డి ట్లనియె 9

సీ. ఇమ్మహాలింగంబు నెమ్మితోఁ బూఁజించు,
క్రమ మెఱిఁగింతు సాంగంబుగాఁగ
విను మీవు సంకల్పవిధిపూర్వకంబుగా,
నవవారి నభిషేచనం బొనర్చి
యొప్పుగాఁ బీఠమందునిచి యావిమ్మట,
నతిశుభ్రగంధపుష్పాక్షతముల
నర్చించి ధూపదీపాదికంబు లొసంగి,
నెమ్మదిలోన ధ్యానమ్ముఁ జేసి
తే. మొదలఁ జితిభస్మ ముపహారముగ నొనర్చి,
యంత నాత్మోపయుక్తాన్న మాదరమున
మరల నైవేద్యమొనరించి మంత్రపుష్ప,
వందనాదులు గావింపవలయు నెపుడు 10

క. క్రమ్మఱఁ బూజించి ప్రసా,
దమ్ము ధరింపఁ దగు సంతశీతమును జితాభ
స్మమ్ము నివేదించిన శీ,
ఘ్రమ్మున సంతుష్టిఁ జెందు శీగంగాధరుఁడున్ 11

క. అని యుపదేశించిన విని,
జననాథకుమారుపలుకు శీసత్యం బనుచున్
దనలో నెంచుచు దృఢమతిఁ,
జనియెన్ శబరుండు తనదు శీసదనంబునకున్ 12

చ. నిరుపమభక్తి నాత్మతరు
ణీసహితంబుగ నీశ్వరార్చనా
పరత వహించి యంతఁ జితి
భస్మనివేదన మాచరించి క్ర
మ్మఱ నిజభోగ్యవస్తుచయ
మంత నొసంగుచుఁ దత్ప్రసాదమున్
శిరమునఁ దాల్చి పిమ్మట భు
జించు సతిండు మనంబు రంజిలన్ 13

వ. ఇట్లు శబరీసమేతంబుగా శబరుం డమ్మహేశ్వరలింగంబునకు దృఢభక్తిపరుం డై నిరంతరంబు పూజనం బాచరించుచు న్నంతఁ గొన్ని దినంబులకుఁ జితాభస్మరహితం బైన పాత్రంబు నిరీక్షించి తత్సంగ్రహణార్థంబుగ నలుదెసలుం బరికించి యెందును గానక మరలి నిజనివాసంబునకు వచ్చి విషణ్ణచిత్తంబున మౌనవ్రతుం డై యున్న నిజవల్లభుం గాంచి తత్కుటుంబిని యి ట్లనియె 14

క నీ వేటికిఁ జింతించెదు,
శైవసమర్చనము లేల సమకూర్పవు నీ
భావముఁ దెలియం బలుకుము,
నా విని యాశబరుఁ డనియె నతవదనుం డై 15

తే ఇంతి ! విను మీదినంబున నీశ్వరోప,
హారమునకుఁ జితాభస్మ మబ్బ దయ్యె
శైవపూజాంతరాయంబు సంభవించెఁ,
గాన నిఁక నేమి సేయుదుఁ గమలవదన ! 16

క గురువాక్యోల్లంఘనమున,
దురితంబులు వొందుఁ గానఁ దొయ్యలి ! వినుమా
పరమేశ్వరుఁ బూజింపక,
తిరముగ భుజియింప నొల్ల దృఢమతి నెపుడున్ 17

వ అని యివ్విధంబున నొడివిన ప్రాణవల్లభునకుఁ దత్కళత్రం
బి ట్లనియె 18

సీ ప్రాణేశ ! దీనికై పరితాప మేటికి ?,
నిపు డొక్క సదుపాయ మేను గంటి
బహుదారుమయనిజగృహదాహ మొనరించి,
తనువేను వైచి దగ్ధం బొనర్తుఁ
దద్భస్మమున నివేదన మాచరింపుము,
పరమేశ్వరునకు సాదరత మెఱయ
నని విన్నవించినఁ దనపత్ని నీక్షించి,
శబరుండు పల్కె విస్మయము నొంది

తే సరస ధర్మార్థకామమోక్షములకెపుడు,
సాధనంబు సుఖార్ణవంబు సకలభోగ
భాజనంబు సుయౌవనంబైన తనువు
నెట్లు విడిచెదు సంతానహీన వగుచు 19

వ అని పలికిన శబరుం జూచి శబరి యిట్లనియె. 20

క. పరజనులకుఁ గానిచ్చిన,
శరీరమున సుకృత మందునే సాయుజ్యగతి
శ్వరున కొసంగినతనువుల,
వరపుణ్యం బెన్నఁ దరమె వాక్పతికైనన్ 21

ఉ పూర్వభవాంతరంబులను
బుణ్యము లెన్ని యొనర్చి యుంటినో
పర్వతకందరస్థలిఁ ద
పంబుల నేఁ క్రియ సల్పియుంటినో
సర్వసరిజ్జలంబుల భృ
శంబుగ మజ్జన మాడియుంటినో
శర్వసమర్చనంబునకు
సారనిజాంగ మొసంగఁ గాంచితిన్ 22

వ అని పలికి నిజవల్లభు నొడంబఱిచి పుణ్యజలావగాహనం బాచరించి శుచీభూతగాత్రయై హరిద్రాంజన కుంకుమ గంధ పుష్పాక్షతాద్యలంకృత యై నిజగృహద్వారంబున నన లంబు దరికొల్పి ప్రదక్షిణత్రయం బొనరించి యవ్వీతి హోత్రునకు నభిముఖంబుగా నిలిచి గురువందనంబు గావించి యమ్మహాదేవుఁ దన మనంబునఁ దలంచుచుఁ గృ తాంజలి యై యిట్లని స్తుతియించె 23

ఉ. దేవ ! మదింద్రియంబులు ప్ర
దీప్తనుమంబులు దేహ మిష్టసం
భావితగంధధూప మతి
భాసురచిత్తము దీపమెన్నఁ బ్రా
ణావలియే హవిస్సు కర
ణంబులు మీకు సితాక్షతంబులై
జీవితపూజనం బిపుడు
సేసెద నయ్య కృపాపయోనిధీ ! 24

తే. సర్వలోకాధిపత్యంబు సే స్వర్గమైన,
బ్రహ్మపదమైన వలదు మీ పాదమాన
తావకపదాబ్జభక్తి చిత్తంబునందు,
వెలయఁ జేయుము భవశతంబులకునైన

క. అని ప్రార్థించుచు శబరుని,
వనితామణి ధీరవృత్తి వహ్నిజ్వాల
న్మన మలరఁ బ్రవేశించుచుఁ,
దనమేను దహింపఁ జేసెఁ దత్క్షణమందున్. 26

క. అంతఁ జితాభస్మము త,
త్కాంతుఁడు దా సంగ్రహించి తగఁగఁ గుటీరో
పాంతంబున శైలసుతా,
కాంతునిపూజన మొనర్చెఁ గౌతుకమతి వై 27

సీ. శబరుండు శివపూజ సలుపుచు వివశుఁడై,
మహితప్రసాదసంగ్రహణమునకు
నెప్పటియట్లు తా నొప్పఁగాఁ బిల్చినఁ,
దనపత్ని వచ్చి ముందటను నిల్చె

నంత నాశబరుఁ డత్యద్భుతస్వాంతుఁడై,
ప్రాంజలియై యున్నపడఁతిఁ గాంచి
నిర్దగ్ధదేహ వైనీవెట్లు వచ్చితి,
విపుడు నిజాలయంబెట్లు వ్రేడమెఁ

తే దేజమున నగ్ని దహియించు దినకరుండు,
కిరణములను దహించు భూవరుఁడు దండ
మున దహించును మనమున భూసురుండు,
తగ దహించును శాస్త్రసిద్ధంబు లిట్లు 28

క అటు గావున గృహయుతముగఁ,
జటులజ్వాలాగ్నిదగ్ధసర్వాంగివై
యెటువలె వచ్చితి విప్పుడు,
నిటలాక్షునిమహిమఁ దెలియనేర్తురె మనుజుల్. 29

వ అని విస్మయాక్రాంతచిత్తుండై యడిగిన శబరునకు శబరి
యి ట్లనియె 30

మ దహనజ్వాలలయందు జొచ్చి సుఖని
ద్రం జెంది నిర్మాల్యసం
గ్రహణార్థం బయి పిల్వఁగా వినుచుజా
గ్రత్త్వంబు సంధిల్లినన్
గృహమున్ దేహము పూర్వరూపములభం
గిం జెంద నే తెంచితిన్
మహితం బైనశివప్రసాద మిది న
న్మన్నింపు ప్రాణేశ్వరా! 31

సీ. అని యివ్విధంబున ననతిశయహృదయాను,
        రాగంబు దోఁపఁ బరస్పరంబు
శబరదంపతులు సంభాషణంబులు సేయు.
        నవసరంబున విస్మయము జనింప
దివినుండి వచ్చె దేదీప్యమానం బగు,
        మణిమయమైన విమాన మొకటి
యంత నయ్యిరువుర ననతిమైత్రిఁ బుష్పకా
        రూఢులఁ జేసిరి రుద్రభటులు

తే. భవ్యశివపారిషదకరస్పర్శనమున,
విమలతరమైన దివ్యదేహములు దాల్చి
సిద్ధచారణగంధర్వసేవ్యమైన,
శ్రీసదాశివలోకంబుఁ జేరి రపుడు  32

వ ఇట్లు శ్రద్ధాపూర్వకంబుగ శబరదంపతులు పరమేశ్వర పూజనం బాచరించి నిజదేహంబులతో మహాయోగిజన సంభావితం బైన శివలోకంబునకుం జని యందుఁ బరమానందంబున నుండి రని చెప్పి సూతుం డిట్లనియె  33

క కులవిద్యాచారంబులు,
తలఁపఁగఁ బని లేదు భక్తితాత్పర్యముచే
నలికాక్షునిఁ బూజించుచు,
విలసిల్లెడుఘనునిఁ బోలువిజ్ఞులుఁ గలరే ?  34

# కూర్మపురాణము.

(20) జయధ్వజుని విష్ణుభక్తి.

వ ఆకార్తవీర్యార్జునునికి నూర్వురు కుమారులు పుట్టిరి, అందై
దుగురు బలవంతులు, శూర శూరసేన వృష్ణ కృష్ణ జయ
ధ్వజు లనువారు 1

క వారైదుగురు మహారణ,
శూరులు సత్కృతులు సత్యశుద్ధులు ధర్మో
దారులు కడపటివాఁడు,
నారాయణపరుఁడు మొదటినల్వురు శైవుల్ 2

తే ఆజయధ్వజుఁ డచ్యుతునమితభక్తి,
శరణ మని పూజ సేయంగ శైవులైన
మొదటినల్వురు శూరాదులది తగ దని,
యాజయధ్వజునకు నిట్టులనిరి ప్రీతి 3

క మనతండ్రి శంభుభక్తుఁడు,
జనకునిమార్గంబు విడువఁజన దన వారిం
గని యిట్లనియెఁ దదనుజుఁడు,
వినుఁ డిది నామతము మీకు వివరింతుఁ దగన్. 4

మ తలఁపన్ రాజులు కేశవాంశజను
లిద్ధాత్రీతలం బెల్ల ను
న్నలిఁ బాలింతు రవశ్యమున్ నృపుల కా
లక్ష్మికళత్రుండు ని

ర్మలలోకత్రయపాలనప్రకటశుం
భద్దివ్యచారిత్రుఁ డే
వలనం జూచినఁ బూరుషో త్తముఁడె కా
వంద్యుండు సర్వ్యం డిలన్ 5

చ వినుఁడు గుణత్రయిన్ మొదట
వేఱుగఁ దోఁచెను మూఁడు మూర్తులం
దు నొకఁడు సాత్త్వికుండు హరి
దుష్టతతిం దునుమాడి చేయుఁబా
లనమును రాజసుండు కమ
ల ప్రభవుండు జగజ్జనిక్రియన్
దనరెను దామసుండు మఖ
దారకుఁ డంతయుఁ ద్రుంచుఁ గావునన్ 6

తే ధరణిఁ బాలింప నమరిననరపతులకుఁ,
బాలనమునకు సాత్త్వికభావుఁ డైన
హరి సమర్చింప నగు నన న్నన్న లతిమ,
నస్వ లిట్లని రాతమ్మునకు నయమున 7

సీ వినుము సంహారకృత్తని రుద్రు నంటి వా,
తఁడె ముముక్షులకు నెంతయు నుపాస్యుఁ
డనఘు తామసశక్తి నవలంబన మొనర్చి,
కాలమైనప్డు లోకముల నెల్ల
లయ మొనరించు నట్లనె నిజజ్ఞానశ,
క్తిని జేసి సంసారిజనుల దుర్జ
యావిద్యను హరించి యమృతఁ బొసఁగుఁ గాన,
శివుఁడు పూజ్యుఁడు మనీషిప్రతతికి

తే. ననిన వారల కనియె జయధ్వజుండు,
సత్త్వగుణ మొందు నరుఁడు మోక్షంబు నొందు
సాత్త్వికుఁడు గాన హరియె మోక్షప్రదుం డ,
టంచుఁ బలికిన వారలి ట్లని రతనికి 8

తే. నిజము సాత్త్వికజనులచే నీలకంఠుఁ,
డర్చితుం డయి సత్త్వము నతఁడె తాల్చి
మోక్షము నొసంగుఁ గాన ముముక్షువులకు,
శంకరుఁ డిఁకరాజ భక్తితోఁ జలుపవలయు 9

క. మునులు స్వర్గము మోక్షం,
బునకుఁ గడ స్వంబు బంధమున కని రటు గా
కను విష్ణుశక్తి దేవత,
మనకుఁ దదర్చనమె యుత్తమము ధర్మ మగున్ 10

ఆ. అనిన నగుచు నిట్టులనియెఁ గృష్ణుం డను,
నతఁడు మనకుఁ దండ్రి యర్జునుండు
దేనిఁ జేసె మున్న యదే కదా మనకును,
ధర్మ మన వివాద దగిలె నిట్లు. 11

ఆ. వాద మెక్కుడైన వల దని యట శూర,
సేనుఁ డందఱకు వచించె నిట్లు
దీనివిషయ మేమి తెల్పుదురో ఋషు,
లదియె సత్ప్రమాణ మగును మనకు 12

సీ. అనిన సంరంభమ్మునను వార లందఱు,
నరిగిరి సప్తమహర్షు లున్న
యాశ్రమమునకు బ్రహ్మజ్ఞానపూర్ణు లా,
వారికిఁ దెల్పిరి వాద మెల్ల

నపుడు వసిష్ఠాదు లారాజులకు యథా,
ర్థముగ వచించిరి సుమతులార !
యెవ్వని కే దేవుఁ డిష్టమో వానికి,
నతఁడె దేవుం డగు నదియె నియమ

ఆ. మనఁగరాదు కార్య మున కయి యే దేవు,
నైనఁ గొలిచి ఫలము నంద వచ్చు
నిదియుఁ గాక మీకు నెఱిఁగింతు వినుఁడు వి,
శేష మొకటి కలదు శిష్టఫణితి 13

సీ. నృపులకు విష్ణుండు నింక నింద్రుండును,
విప్రుల కగ్ని నవిధిహారులును
సురలకు విష్ణుం డసురులకు రుద్రుండు,
యక్షగంధర్వుల కమృతకిరుఁడు
విద్యాధరుల కైందవీదేవి సాధ్యుల,
కినుఁడు రక్షస్సుల కీశ్వరుండు
కిన్నరులకు హిమ వన్నగాత్మజ ఋషు,
లకు శివాజులు మను ప్రకరమునకు

తే. నార్యవిష్ణ్వీశ రవులు గృహస్థున కిఁక,
సర్వదేవతలును బ్రహ్మచారి కజుఁడు
కనఁగ వైఖానసులకు భాస్కరుఁడు యతికి,
శివుఁడు దేవత లని మున్ను చెప్పె నజుఁడు 14

తే. భూతములకును గూశ్మాండ జాతములకుఁ,
గ్రమముగా రుద్రుఁడును మహా గణపతియును
నందజకు బ్రహ్మయే దేవుఁ డనుచు మున్ను,
ధాత దెల్పెను లోక విఖ్యాతముగను 15

ఉ. కాన జయధ్వజుం డసుర
కంటకువిష్ణునిఁ గొల్వవచ్చు నం
చాన యొసంగ నాఋషుల
కందఱకున్ బ్రణమిల్లి యప్పు డా
మానవనాథపుత్త్రు లన
మప్రభనొప్పెడురాజధానికిన్
భూనుతచర్య లేగి ప్రజఁ
బొందుగనేలి రరుల్ చలింపఁగన్ 16

# * టిప్పణము.

## (1) ఉదంకుఁడు పౌష్యమహాదేవికుండలములం దెచ్చుట

[ఉదంకుఁడు పైలునిశిష్యుఁడు ఇతఁడు గురుదక్షిణ యేమి యిలయు నని యడుగ, నతఁడు తనభార్య నడుగు మనియె ఆమె పౌష్యునిభార్యకుం డలములు తెచ్చి యిమ్మనెను శిష్యుఁ డందులకై పోయి పెక్కుచిక్కులు పడియు, తుదకుఁ దనకార్యము నెఱవేర్చుకొనియె ఇందు, గురుభక్తి శిష్యునిశక్తియె కాక, ఘనకార్యనిర్వహణాసక్తియు వెల్లడి యగుచున్నది]

**45** అఘపంకము, తపస్సలిలము-రూపకసమాసములు తపస్సుచేఁ బాపములు పోఁగొట్టుకొన్నవాఁడు న+ఆతంక = అనాతంక, నఞ్‌తత్పురుషము భక్తిన్‌-తృతీయార్థకమైన ద్వితీయ

**45** గురుకులము-ఇందు, కులమునకు గృహ మని యర్థము 'గురుకులవాస' మన్నమాట వినుచున్నదె అణిమ, మహిమ, లఘిమ, గరిమ, ప్రాప్తి ప్రాకామ్యము, ఈశిత్వము, వశిత్వము-ఇవి యణిమాదులు వినినే యష్టసిద్ధు లందురు

**45** నియోగము-ఆజ్ఞ, వాని పన్నినప్రయోగవిశేషము

**46** ఏను-నేను రూ నానా అయిదు గుర్వర్థి-గురు+అర్థి యణాదేశసంధి. పూన్కి- రూ పూనికి, పూనిక పూనుధా- కృత్తు

**46** ఈఁగ్‌+కాంచితిఁగ్‌, ఈఁగ్‌=ఇచ్చుధా- తుమున్నర్థకము రూ ఈయఁగ్‌, ఇయ్యఁగ్‌ అంతఃపురము-తత్స, అంతిపురము- తద్భ

**46** ఈపద్యములో, రాజు మాటల మృదుత్వమెట్లున్నదో గ్రహింపునది

**46** ప్రక్షాళితపాణిపాదవదనుఁడు-పంచార్థ్రిభావ మిదే

---

* ఈటిప్పణిలో పదములకు మొదలవేసిన అంకె పేజీని తెలుపును

47 రోయు-క్త్వా, రోసి=అసహ్యపడి రోయు=వెదకు; అశుద్ధాన్నము—
అశ్లీలము, ఉదంకపౌష్యుల పరస్పరశాపము లిందుఁగలవు స్వల్పవిష
మునకై శపించుట సజ్జనలక్షణము కాదు.

ఇది యెన్నికయైన పద్యము ఇందు, (10) బ్రహ్మక్షత్రియులకు మనో
వాక్కులయందుఁ గల వ్యత్యయమును, సమర్థతలును, ఎంతో చక్కఁగఁ
జెప్పఁ బడినవి. ఆఖండల శస్త్రము = వజ్రాయుధము (కనరితమ
మైనది )

48 నగ్నవేషము=దిగంబర వేషము

48 భూవివరము-భూ+వివరము=(బిలము) నానా స్పష్టము

48 తోడన తగిలి=వెంటఁబడి

48 కులపర్వతములు-మహేంద్రము, మలయము, సహ్యము, శుక్తిమంతము,
గంధమాననము, వింధ్యము, పారియాత్రము సహస్రఫణములు=వేయిపడ
గలు, అనంతుఁడు భూమిని మోచువాఁడు, విష్ణువునకుఁ బాను పు, అయ్యు
దుర్గ-సంప్రార్థనార్థకము

48 అరిది = దుర్లభము, అశక్యము, అరుదు = ఆశ్చర్యము అపూర్వము
వాసుకి శివునకు అలంకార మైనవాఁడు

49 కోటి=తుద, హద్దు (ఐరావతకోటి=ఐరావతుఁడను చిన్నపాముపఱకుఁ
గల) ఫణిరాజులు-రాజి-బ వ. రాజులు=సమూహములు, ఫణిశబ్ద మమ
హాదర్థకము కాఁబట్టి 'అయ్యొదుర్గ' అనుక్రియ యేకవచనమం దున్నది

49 ఈక్షణశ్రోత్ర=చక్షుశ్శ్రవః=కన్నులే చెవులుగఁ గలవి, పాములు ఇవి
వినునెడఁ జూడ లేవు, చూచునెడ వినలేవు

49 నాగకులము=పాములసమూహము, అనుపయించు = నేయు
ద్వాదశ + అర + చక్రము, అర = అంచు
అతిప్రమాణ = ప్రమాణాతీతమైన, అతిభక్తి = ఎక్కుడు భక్తి
ఉదంకునకు తృతీయార్థము కుక్షి.

49. మితవచన + అనియమిత+అర్థ+స్తుతులకుఁ—కొలఁది మాటలలోనే విపులార్థము గల స్తోత్రములకు ఇదియె విశేషము *

50 కరంబు=అవ్య—మిక్కిలి, నానా-చేయి, పన్ను, తొండము ధ్మానము=ఊఁదుట, వల్లె—గూ - వల్లే, అవ్యయము-అంగీకారసూచకము

ఈపద్యమున 21 భయానకరసము వర్ణింపఁబడినది సమయోచితముగ శబ్దాడంబరము, తదనుకూలముగ శార్దూలవృత్తమును, గలవు బాడబము, బాడబానలము—మధ్యమపదలోపి కర్మధారయము అతఁడు గుఱ్ఱము మొగమువంటి మొగముగల సముద్రమధ్యస్థమైన యగ్ని శంకరనిభుఁడను విశేషణము విప్రునకు 'భయంకరకోపాగ్ని' యనుటచే సార్థకమైనది పరికరాలంకారము

---

## (2) దుష్యంత మహారాజు చరిత్ర.

[ఇందు, శైలి స్వభావసిద్ధముగ నున్నది, శకుంతలాదుష్యంతుల పరస్పరానురాగము, కణ్వుని యనాథ సంరక్షణదీక్ష, శకుంతల దుష్యంతునితోఁ జేసిన వినయ వివేక విహిత ప్రసంగము, దివ్యమర్త్య పాత్రముల సమ్మేళన వైశద్యము, రసవంతముగఁ జిత్రింపఁబడినవి ]

50 దుష్యంతుని తండ్రి నీలుఁడని యిందు ఒండొకచో ఈలినుఁడు తల్లి రథంతరి చంద్రవంశ్యుఁడు.

50 దుష్యంతుఁడు బాల్యమునందె సింహశరభాదులను బాలహరిణముల వలెఁ బట్టె ననుటనుబట్టి చూడ, నితఁడు పెద్దతనమున నెంతటి పరాక్రమవంతుఁ డగు నని తోఁచునో కనిపెట్టునది
వి+సమ=విషమ విషమ+అటవి—సవర్ణదీర్ఘసంధి, శార్దూల + ఇభ —గుణసంధి, బాల + త్వ-'త్వ' భావార్థకము, బాల్యము (రూ) బాలత్వమునందు-'అ', నిశ్చయార్థము

3. ఒండు-మఱి యొక వై చు-రూపాం వేయు.

---

* మూలమునటిప్పణికి భిన్నముగా పాఠముగలదు దానిచొప్పున అర్థమిట్లుండును:- మితవచన = పరిమితములగు మాటలుపల్కువాఁడా, నీయథార్థస్తుతులకు = నీయొక్క సత్యము నతిక్రమింపని స్తోత్రవాక్యములకు

యౌవనగర్వము శక్యాశక్యముల గణింప నీయ దని భావము
అతిశయోక్తి, యౌవన గర్వము - తద్భ - జవ్వనపుగరువము

51 ఆశాంతమాతంగములు=దిగ్గజములు - ఎనిమిది - ఐరావతము, పుండరీకము, వామనము, కుముదము, అంజనము, పుష్పదంతము, సార్వభౌమము, సుప్రతీకము ఇవె కాక, సప్తకులపర్వతములు, ఆదికూర్మము, ఆదివరాహము ఆదిశేషుఁడు భూమిని మోయుచున్నట్లు పురాణములు చెప్పుచున్నవి
ఆదిత్యాంశు = సూర్యకిరణములు, సమీర=వాయువు, ఇవి చొరని యరణ్య మనుటచే సాంద్రాటవి యని భావము
వీర్యయుఙ్-'న' వర్ణకము తృతీయార్థకము వీర్యము తద్భ-బీరము,
'ఆది క్షత్త్రి చరిత్ర నేలె'—పూర్వరాజ మర్యాదను పాటించి పాలించె

51 రుజ - రూ - స్త్రీ రుక్ = రోగము ,

51 మృగయ - రూ - మృగవ్య - మృగములఁ జంపుట, వేఁట
పూంచిన - పూనిచిన - పూన్చిన - (రూ) = కట్టిన
ఆజానేయము=అజానదేశమునఁ బుట్టినది, ఉత్తమాశ్వము, ఆజానేయమె తురంగార్థమై యుండ, తురంగమును జేర్చుట, కరికలభము వంటిది. ప్రయోగదృష్టము

51 ఆర్వుల బొబ్బల యులివు—ఆర్పుబొబ్బ లని ద్వంద్వముగఁ జెప్పక, వేర్వేఱ విభక్తి లోపముతో సమసింపఁజేయుట యిందలి ప్రయోగ విశేషము ఆర్పు-ఆర్పుధా॥కృ॥ఉలియు ధా॥కృ॥ ఉలివు
విపినమును మహోదధిగాను, దుష్యంతబలమును మందరము గాను నిరూపించెను సముద్రమథనకథ సూచింపఁబడుచున్నది

52 కడిమిమెయిఙ్ - 'మైఙ్' రూపాం॥ 'చేత' యని యర్థము అవ్య॥ నామవాచకము-మెయి=శరీరము

52 ఏసి - వేసి - ప్రేసి - సమార్థకములు. = కొట్టి

**52.** పిపాస - సనాద్యంతధాతు వృత్తి - త్రావనిచ్ఛ

**52.** ఉపమాలంకారము

**52.** చొచ్చు + అపుడు—నుగాగమము

**53.** ఇందు, ప్రకృతి సౌందర్యము లలితముగ వర్ణింపఁ బడినది
అలంకారము ఉత్ప్రేక్ష సేసలు=తలఁబ్రాలు
పుష్పము లక్షతలుగాను, పక్షుల కలకలములు దీవనలుగాను, చెప్పఁ
బడుట భావిశుభ సూచకము అట్టెరు = అట్టివారు తచ్ఛబ్దవకారలోపము
వృత్తము చంపక మవుట, మఱింత సొగసును తెచ్చినది

**53** కాఱు+అడవి-కాఱుటడవి, కాఱడవి
ఊఱడక-విశ్రాంతియను మాటలేక
ఆఱ్ఱ=పోవునట్లు, ఆరఱ=ఇండునట్లు, (కన్నులార)
ఎద-తద్భ, తత్స-హృదయము
దుష్యంతుని యుద్యమమున ప్రకృతియుఁ దోడుపడుచున్నది
మానినీవృత్తము-రాఁబోవు మానినీవృత్తమును స్ఫురింపఁజేయుమన్నది
మనశ్శోభవర్ణితము
ఏచి=పెరిఁగి, తనర్చి=ప్రకాశించి, తలిర్చి=చిగిరించి
తావు-అన్యదేశ్యము, పినులు-నిత్యబహు

**53.** రాజుమనసులోని యుత్సాహమువలెనే, యూవృత్తమును చిత్రగతిని
నడచుచున్నది (16 ప)
చనిచని-ఆమ్రేడితము-బహుదూరము పోయి
హోమభూమము తీఁగవలె చెట్టుకొమ్మలఁ జుట్టుకొనుటచే, పువ్వులు
లేకున్నను తుమ్మెదలు అంటిపెట్టుకొని యుండుట యిదియొ మున్నా
శ్రమమని తోఁపించినది

**54** వేదమునకు, 'పదము' 'క్రమము' మాత్రమేగాక జట, ఘన, కలవు.

**55.** కరులయు+సింహంబులయు+సత్త్వంబులయు+సహవాసము— దూరో

న్వయమై 'యొక్క' లోపించిన సమాసవిశేషము ఎట్లు, మునితపో మహిమ జాతివైరము నుడిపినదో ।

55 నానమ్నసంతకుల్ — నేను వచ్చువఱకు ప్రయోగవైచిత్రి

55 తత్ ×ముని=తన్మని

55 జయంతుఁడు-ఇంద్రుని కొడుకు, రూపమునకు ప్రసిద్ధిఁగన్నవాఁడు మఱి, కుబేరకుమారుఁడు నలకూబరుఁడు, విష్ణుపుత్త్రుండు మన్మథుఁడును సౌంధర్యమున నెన్నిక గన్నవారె అర్ఘ్యపాద్యాదివిధులన్-అది శబ్దముచే గ్రహింపఁదగినవి మఱేవి ?

55 ఒకొ-సందేహార్థకము

56 ముహూర్తము=12 క్షణములకాలము, 2 గడియలకాలము, వచ్చితని-వచ్చితివి+అని, మధ్యమపురుష ఇకారలోపము

56 జగతి-తెల్పము-భూమి, దేశ్య=అరఁగు

25 తవిలె-తగిలె-గ కారమునకు వకారము, ఇట్లు అగు,అవు, నమ్మ నేరనయ్యెదన్-అగుధాతుభూతార్థక మనుప్రయుక్తమైనది వాడుకలో, నమ్మ నేరనైతి కలయాపు=విజస్థితి

57 ఊర్ధ్వరేతుశతుఁ గూఁతురు వెట్లయితి వని యడుగుట యనుచితము

57 కార్శ్యపులు-కణ్వుఁడు-పూజార్థక బహువచనము, అర్థి-తెనుఁగున కోరిక, తిల్పమమున యాచకుఁడు

58 చెడిచి-చెడుధా "పేర-క్త్వా"

భయంపడి-భయముపడి-మున్వర్ణమునకు నిండుసున్న

58 త్రిశంకునియజ్ఞమునకు విశ్వామిత్రుఁడు యాజకుఁడై యుండ, వసిష్ఠుఁడు తాము చేయింపనిదాని నీతఁడేల చేయించుచున్నాఁడను నీసుచే నధిక్షేపింపఁగా నలిగి, వసిష్ఠకుమారులను శక్తిమున్నగు నూర్వురను జంపె నని పురాణము

పాడి=న్యాయము, పాఁడి=పాలు, పెరుఁగున్నగునవి-పాడి+ఎ-,ఎ' ప్రశ్నార్థకము

**59.** పమిన్న=అతిశయించిన, రూ-పంచిన,

విశ్వామిత్రునికోపముచేఁ గల్గిన యుత్పాతము లిందుఁ గలవు. (**33** ప)

**59.** దక్షిణమారుతము-మలయమారుతము 'చల్ల', 'అల్లన' 'సుగంధి'-వీనిచే వాయువునకుఁగల శైత్య,మాంద్య, సౌరభ్యము లను గుణత్రయి వివరింపఁబడె

**59** కౌశిక=విశ్వామిత్ర, ఇంద్ర.

విశ్వామిత్రుని తపస్సు దేవేంద్రునికేల బాధకము?

తపోగ్నివలన ( ప్రజలకుఁ గల్గు బాధ రాజుదె కదా !

**60** పుష్పాపచయము—పుష్ప+అపచయము = పువ్వులుత్రుంచుట (కోయుట), వ్య ఉపచయము=పెంచుట

సఖులు-సఖి, సఖుఁడు, ఏకవచనములు, ఇచట స్త్రీపరమె

**60.** పలుద+ఎడలన్-అకారసంధి

న్ద-పలుదయొక్క రూపాం, = స్థూల మైన,

**60** కందర్పసాయకములు-అయిదు అరవిందము, అశోకము, చూతము నవమల్లిక, నీలోత్పలము ఇవి కలుగుటచేతనె మన్మథుఁడు పంచబాణుఁ డనఁబడు

**60** ఏఱు-ఏటి-ఔపవిభక్తికము-సమాసమున,

**60** చెట్టుపలు-రూ-చేట్టుపలు, = అెక్కులు

**61** కూఁతురు - ద్వి॥ ఏకవ॥ కూఁతున్ పోని=పోలిన శకుంత+ల=పక్షులచే రక్షింపఁబడినది (వ్యు)

**61** అక్కరలు-ఐదువిధములు కర్ణాటభాషాసిద్ధములు మధురాక్కర-ఒకసూర్యగణము, మూఁడింద్రగణములు, ఒక చంద్రగణము కలది వృత్తములట్ల ప్రాసము యతి మూఁడు గణముల పైని

ఇందు, స్త్రీకి ముగ్గురును, పురుషున కైదుగురును, గురువు లయినట్లు చెప్పఁబడిరి

ఏను+గురు-ఏఁగురు రూ-ఏవురు

అనయము-దేశ్య-ఎల్లప్పుడని యర్థము తత్స-అన్యాయము

61 శకుంతల-కణ్వుని పెంపుడుకూఁతురు కణ్వుఁడు శకుంతలకుఁ బెంపుడు తండ్రి

అలంకారము-ఉపమ

61 అభిజాతభావ మాభిజాత్యము-ఉన్నత వంశసంభవము

62. శకుంతలాసహజసౌందర్యమునకు వనవాసాదికము విపరీతముగా దుష్యంతునకుఁ దోఁచెను

ఉచితము+ఎ-'ఎ' కాక్వర్థకము

'గుణముల్'—అమహదర్థక బహువచన విశేష్యము కావున, దీని విశేషణము 'ఉచితము' అని యేకవచనమున నున్నది

62 'నీవిలాసమునకు మానివాసమె యర్హమైన' దని దుష్యంతుఁడు శకుంతలతో నిజాభిప్రాయమును వెల్లడించెను

62 వివాహము లెనిమిదిటిలో గాంధర్వ రాక్షసములు క్షత్రియ వైశ్యులకుఁ దగినవి కన్యావరులు పరస్పరప్రేమచేఁ జేసికొను వివాహము గాంధర్వము బలాత్కారముగ వధువు నెత్తికొని పోయి చేసికొను పెండ్లి రాక్షసము

లజ్జన్+చేసి—చేసి, తృతీయార్థమైన అవ్యయము

63 'కరుణానిరతులు' 'ధర్మస్వరూపులు'—ఈ విశేషణములు సమయసముచితముగ నుపయోగింపఁబడినవి

63 గాంధర్వవివాహస్వరూప మిందు వివరింపఁబడినది (53 ప)

63 శకుంతలకోరిక నుబట్టి యామెలో కజ్ఞత యెట్లు వెల్లడియగుచున్నదో!

64 కణ్వుని దివ్యదృష్టి యిందు స్పష్టపడుచున్నది.

'నీదుగర్భమునవాఁడు'—అలుక్సమాసము

64 'నాచిత్తము ధర్మువునందె తగిలియుండ వరమి' మ్మనుటచే, శకుంతలయొక్క లోకాతీతసౌశీల్యము ద్యోతితము. శకుంతల వర్షత్రయము చూలుదాల్చుట లోకాతీతము సద్యోగర్భసంభూతి, మూఁడు తొమ్మిదులు మోచుటకంటె నిది మించినది

శాకుంతలుఁడు-అపత్యార్థకతద్ధితము

65 సత్త్వము = బలము, జంతువు

అందలిమునులు-అంద్వాదుల కలిగాగమము సమాసమున

66 సాధ్వి = పతివ్రత - సాధుశీల

తద్ద - రూ - తద్దయు, ఇట్లువెండి - వెండియు

ఏడుగడ - (ఏడు + కడ) గురువు, తల్లి, తండ్రి, పురుషుఁడు, విద్య, దైవము, దాత - అని యేడుగురు దిక్కు

"క. గురుఁడును దల్లియుఁ దండ్రియుఁ

పురుషుఁడు విద్యయును దైవమును దాతయు నాఁ

బొరి నేడుగడయుఁ దానై

హరి నను రక్షించుఁగాత ననవరతంబున్"

66 ఎడ=కాలము దవ్వు=దూరము-ఎడ దవ్వగుట = చాలకాల మగుట

ముగ్ధలు=మోహపరవశులు

66 'పృథివి నధిపులు నూతనప్రియులు గారె?' అని నానుడి

67 "క. తెలియని మనుజుని సుఖముగఁ

దెలుపందగు, సుఖతరముగఁ దెలుపఁగ వచ్చున్

దెలిసిన వానిం, దెలిసియుఁ

దెలియని నరుఁ దెలుప బ్రహ్మదేవుని వశమే?" భర్తృహరి

కంటి=వంచకుఁడు, మోసగాఁడు.

67. పోవంగాదు = పోఁదగదు.

67 గొనకొను = యత్నించు

68 వెల్ల వెల్ల నై = వెల వెల పోయి,
వెచ్చనూర్చి - వేఁడినిట్టూర్పులు విడిచి
కెంపు + తమ్మి = కెందమ్మి
వాంచి-వంచి- వంగుధా॥ ప్రే॥ క్త్వా

68 మనుష్యుఁ డెంతిరహస్యముగ నేపని చేసినను, భూతపంచకాదులు సాక్ష్యము లగు చుండును
దక్కొనక = దక్కు+కొనక = స్వతంత్రుఁ డగుటకు,
ముచ్చిలక = దొంగిలింప, వంచించుటకు

69 తొంటి - రూ - తొల్లిటి, తొల్లింటి, 'తొల్లి' కి విశేషణము

81 (82, 84) పద్యములు కంఠపాఠము చేయఁదగినవి ఇందు భార్యయందలి ధర్మవిశేషములు వివరింపఁబడినవి

70 ఇందు, సహగమనము పూర్వాచారముగఁ జెప్పఁబడినది, 'అంగాదంగా త్సంభవసి' 'ఆత్మావై పుత్త్రనామాసి' అను సూక్తము లను సంధింపఁబడినవి

70 గార్హపత్యమునుండి యాహవనీయము పుట్టినట్లు, తండ్రి నుండి కొడుకు పుట్టును గార్హపత్యము-సాగ్నికగృహస్థుని యజ్ఞాగ్ని ఆహవనీయము-దేవతల నాహ్వానించుచు వేల్చు నగ్ని దక్షిణాగ్నితోఁ గూడి త్రేతాగ్ను లనఁబడు

70 నీళ్లుల - బహుత్వముమీఁది బహుత్వము

70 పుత్ + త్ర = పుత్త్ర = పుత్ అను నరకమునుండి రక్షించువాఁడు, వ్యు

71 పుత్త్రగాత్రపరిష్వంగము చందనాదికాధికశీతల మనుట ప్రాణము లేచి వచ్చునని వాడుక.

71 వాజ + పేయము = అన్నరూపమైన రసము త్రాగఁబడునది సామవేదులు చేయు యజ్ఞము.

వినిచెన్ - వినుధాతుప్రేరణము (వినిపించెను)

**71** సత్యము = ఇచట, ప్రతిజ్ఞ

'నాఁటిసత్యము కలుగన్' అనుకంటె -కలఁగన్' అనుట మేలు

**88** ఉత్తరోత్తరోత్కర్ష-సారాలంకారము, ఈపద్యమువంటిది

"కం శతకూపాధిక దీర్ఘిక,
శతవాప్యధికంబు క్రతువు • శతయజ్ఞసము
న్నతుఁ డొక్కకొడుకు, తత్కృతు
శతకంబున కెక్కు డొక్క • సత్యోక్తి నృపా"
శతంబు+న+కంటె-ఇందు న గాగమము విశేషప్రయోగము

**72** అశ్వమేధము-దేనియందు అశ్వము బలియీయఁ బడునో, ఆయజ్ఞము ఇది రాజులు మాత్రమె చేయునది దానిం బట్టిన రాజులను జయించి చేయవలసినది

గౌరవంబున పేర్మిన్ - సమాసమున నగాగమము

**72** సరియుఁ గావు + ఎఱుఁగు - సంధిలేమి పాదాంత్యము కాఁబట్టి

అందురు, అంద్రు

**72** సమయము-ప్రతిజ్ఞ నానా-కాలము, ఆచారము, జ్ఞానము సిద్ధాంతము

చూడు-చూడుము ప్రార్థనార్థక మువర్ణలోపము

**72** నీమూలమున మానవంతురాం డ్రందఱు నసత్యవాదిను లనెడి యపకీర్తి రానీయవలదు

నాన్ రూపాం - అనన్

**72** పాడవునన్-ఆకారమునందు

ఎడమడుగుగన్ - వ్యత్యాసముగా

**73** శకుంతలపరితాపము

మధ్యాక్కర - రెండింద్రగణములు, ఒక సూర్యగణము,
రెండింద్రగణములు, ఒక సూర్యగణము - కలది

ఇట్లొక్క-పాదము, ప్రాసము నియతము

ఇందు, యతి నైదవగణము మొదటి యక్షరమయినది

**73** దివ్యవాణి - ఆకాశవాణి - రూపము కనఁబడక వినఁబడుధ్వని, ఇగి, సత్యాసత్యముల నిర్ధారించు పట్ల వినిపించు దైవభాషితము పురాణ ప్రసిద్ధము

**74** విచు + తెంచు = విచ్చెంచు = వచ్చు (విసరు)

**74** లోకాపవాదము - లోకప్రవాదము - నింద

అంటిని నందఱ - ద్రుతముమీఁది ద్రుతము

'ఎఱుఁగనంటినే నందఱ కిప్పు డెఱుఁగ' అనుట లెస్స

**74** ప్రాజ్ఞుఁ డయిన కుమారుఁడు కలుగ, తండ్రి వానప్రస్థాశ్రమము నొందు ట సనాతన ధర్మము బ్రహ్మచర్య, గార్హస్థ్య వానప్రస్థ, సన్న్యాసము లని యాశ్రమములు నాలుగు

భాస్కర, జహ్ను, కన్యకాతీర—యమునా, గంగానదుల యొడ్డుల

---

## (3) ద్రౌపదీ వస్త్రాపహరణము

[దుర్యోధనునిమాయాద్యూతమున ధర్మరాజు తన సర్వస్వమును, సోదరులను, తన్నును, శకుని గెలఁపించుటఁచే గడకు ద్రౌపదిని, ఒడ్డి, యోడినపుడు పాండవులు తనకు వశులైరని రాజరాజు సంతసించి, ద్రౌపది నవమానింపఁ దలఁచి ప్రాతికామి నంపినసందర్భమం దీకథ వచ్చినది ఇందు, ద్రౌపదీదేవిధర్మజ్ఞతయు, అతిలోకమానినీత్వమును, మనోధైర్యమును, భక్తివిశేషమును విస్ఫురితము లగుచున్నవి]

**75** మహిషి = పట్టపుదేవి నానా - గేదె,

పాలికిఁ = దగ్గఱకు నానా - వంతునకు

**75** తరువోజ-రెండు ద్విపదపాదములు కూడి దీన నొకపాద మగును

3, 5, 7, గణముల యాద్యక్షరము యతి

ఓటు - ఓడు ధా॥ కృత్తు

75 యుగములు - నాలుగు - కృత, త్రేతా, ద్వాపర, కలియుగములు ఒడ్డు= పందెము పెట్టు

'భార్య నొడ్డి యోటు పడిన భర్త గలఁడె' యనుట యీమె యమ ర్షాభిమానముల వెల్లడించు చున్నది

75 ద్రౌపది చేసిన సూక్ష్మ విషయవిమర్శన మిం దున్నది

75 సందిగ్ధమైన యర్థము = సందేహాంశము

76 ఏకవస్త్రి=రజస్వల-ఇట్టి యెడ, నొంటి బట్ట కట్టుట మర్యాద

వృకోదరుఁడు=వృక+ఉదర, తోడేటికడుపువంటి కడుపుగలవాఁడు

76 కృష్ణ - నల్లనిది - ద్రౌపది కీపేరు రూఢము

76 స్త్రీనవమానింపఁ దలంచుదుశ్శాసనుని కౌరవాధముఁడనుట యుచితము [మూలపద్యమునందు కౌరవానుజాఁడనియున్నది] అరుగంగఁ బోలు - పోవచ్చును ఒడుచు- = ఓడించు - దేశ్యప్రేరణము

పొల్తి - పొలఁతియొక్క రూపాంతరము, ప్రయోగవిశేషము

77 డాయఁ - రూ - డాయఁ - ఇట, దడల కభేదము ఇట్లు, డాంగు డాఁగు

77 అపశదుఁడు - = నీచుఁడు

రాజసూయము - సర్వదేశాధీశ్వరుల జయించి, వారిచేఁ గానుకలు గొని, రాజులుచేయు నొక ప్రసిద్ధయాగము అవబృథము - యజ్ఞ దీక్షానంతర స్నానము

ద్రౌపది శిరోజములు యజ్ఞమంత్రిత జలాభిషేకము నంది పవిత్రము లయినవి అట్టి వానిని బట్టి దుశ్శాసనుఁ డీడ్చి తెచ్చుట దారుణ కృత్యము

77 కర్ణ శకుని దుర్యోధనసైంధవులు - దుష్టచతుష్టయము

78 భర్తయందలి గౌరవమును, దుశ్శాసనునియందలి దుశ్శీలతయు, ద్రౌపదిమాటలవలనఁ దేఁటపడుచున్నవి

78 ఒక్క దుర్మార్గునివలనఁ గులమున కెల్లఁ దీఱని యపఖ్యాతి కలుగు చున్న దని నీతి ఇందుచేతనె దైవమె దిక్కని ద్రౌపది కృష్ణునిం బ్రార్థించెను

78 జగత్త్రియ - స్వర్గమర్త్య పాతాళములు అలం - అనుప్రాసము

79 ఇన=సూర్యుఁడు నానా - రాజు

79 పణము = పందెము

79 భీమునికి ధర్మజునిపైఁ గల్గిన కోపావేశము స్త్రీగౌరవము చెడుటచే, అగ్రజునియెడ మున్నెంత విధేయత యున్నను, ఇట్లనిపించినది (18 ప)

79 అర్జునని సామరస్యజ్ఞాన మిందు స్పష్ట మగు చున్నది నేరమి = అజ్ఞత

పరులు = శత్రువులు, నానా - ఇతరులు

80 వికర్ణుఁడు దుర్యోధనుని యన్యతమ భ్రాత, ఇతఁడు పిన్న యయ్యు, ధార్మికామర్షమును నిర్భయముగా వెల్లడించినధీరుఁడు విభీషణు నట్టివాఁడు

80 జూదము, పానము, వేఁట, బహుభక్షణాసక్తి - ఈనాలుగే యిట దుర్వ్యసనములు గఁ బేర్కొనఁ బడినవి

“గీ వెలఁది, జూదంబు, పానంబు, • వేఁట, పలుకు
ప్రల్లదంబును, దండంబు•పరుసఁదనము,
సొమ్ము నిష్ప్రయోజనముగ•వమ్ముసేఁత,
యనెడు సప్తవ్యసనములఁ•జనదు తగుల ”

పైఁ జెప్పిన బహుభక్షణాసక్తి యిందు లేదు

వికర్ణునిధర్మవిమర్శన మిటఁ దేఁటపడు చున్నది

వ్యసనాసక్తుఁ డయిన ధర్మజుని పందెము పాటిగాదు

పంచపాండవులకును స్వత్వమైన ద్రౌపది ధర్మజునిచే మాత్రమోటువ డుట తగనిది

ఈ రెండుకారణములచే ద్రౌపదిని జయించితిమని భావించుట రజ
స్వలను దోడ్తెచ్చుట యన్యాయము, అని వికర్ణునివాదము-
గరువము+పలుకులు=గరువంపుఁబలుకులు
ఇందు, ఉవర్ణమునకు, బిందుపూర్వక 'పు' వర్ణకమును,
పిదప నుగాగమమును, వచ్చినవి
చనును+ఎ-చనునె, చన్నె విశేష ప్రయోగము

81 వికర్ణుని ధర్మసిద్ధాంతమును పూర్వపక్షము చేయుటలో
కర్ణుని విపరీతబుద్ధి గానవచ్చెడు

81 ఒల్చెర్=విప్పెను (మూలములో దీనికి బదులుగా విడ్చెయని ముద్రితము)
ఆశంక=పూర్ణ సందేహము
వస్త్రంబునట్టి=వస్త్రమువంటి
ద్రౌపదిదైవవిశ్వాసమహిమ యిట సూచితము
దుర్యోధనుఁడు పరాభవింపఁబోయి పరాభవింపఁబడెను

82 భీముఁడు దుశ్శాసనునిగూర్చి చేసినప్రతిజ్ఞను దెలుపు ప్రసిద్ధపద్యము (28వ)

30 పద్యము మొదలు (38) వఱకును విదురునిధర్మోపన్యాసము
ద్రౌపది తనగౌరవము వెల్లడించినది
'ఆ' విధంబున నట్టు 'శా' స్వయంవరమున నని ప్రారంభించుట మెఱుఁ
గు దెచ్చినది

85 అవ్వా=అమ్మా-గౌరవార్థకము
గహనంబు - చొరరానిది
కులపాంసనుర్=వంశదూషకుని
కర్ణునియనుచితపరిహాసోక్తి (41 ప)
కలాపవిభాసికేశభారమ్మున నొప్పుదానిన్ = నెమలిపురివలె నొప్పు
శిరోజములచేఁ బ్రకాశించుదానిని

కొప్పువీడి వ్రేలాడుచున్నదాని నని భావము.

లయసమయదండధరనిర్దయుఁడై = ప్రళయకాలమందలి యమునివలె దయారహితుఁడయి

భీముఁడు దుర్యోధనునిగూర్చి చేసినప్రతిజ్ఞ - సుప్రసిద్ధ పద్యము (44)

రంభా+ఊరు+నిజ+ఊరు+దేశమునన్-అని పదచ్ఛేదము

ద్రౌపది నవమానించుటచేఁ గలిగిన యుత్పాతములు, (46-47 ప)

వఱలులు-ఏకవ-వఱడు=ముసలినక్క

మహాత్+ఉత్పాత = మహోత్పాత కర్మధారయస కలశభూ = ద్రోణుఁడు (కుంభసంభవుఁడు)

అరిష్టము=కీడు నానా కాకి, కుయుడుచెట్టు- పురిటిల్లు

88 'పరగపతివ్రత, తపస్విని, ధర్మరత, అయోనిజ' ఇట ద్రౌపది ప్రకృతిమానవభామిని కాదని తెలుపుచుండె దెప్పరములు = దుస్సహావచనములు

బాల్యము దక్కవు = చిన్నతనపుఁ జేష్టలు మానవై తివికాదా?

భంగించి=భంగపెట్టి యని సామాన్యార్థము

ఇట, మందలించి యని భావము

కోదండధురయందు - (కోదండయందు) బహుత్వముమీద బహుత్వము,

అభ్యర్చితవు-అభి+అర్చితవు, అభి ఉపసర్గ 'ప్ర పరప్రతి పర్యత్యధ్యభ్యవానూపసంస్వప, ని వి నిర్దురుదప్యాజి త్యుపసర్గాస్తు వింశతిః'

ధృతరాష్ట్రుఁడు వరములు కోరుకొమ్మన్నపుడు, ద్రౌపది, తన్నింతకుఁ దెచ్చిన ధర్మజుని దాస్యమునుండి విడిపింపు మనుట యొక గుణవిశేషము. (54 ప)

దాస్యము = (దాసభావము) సేవ.

69 నెమ్మి=నెమ్మది, నానా-క్షేమము, సంతోషము, నెమిలి
బ్రహ్మ, క్షత్రి, వైశ్య, శూద్ర స్త్రీలు కోరఁదగిన వరముల విధి.
ధృతరాష్ట్రిఁ డెక్కుడు వరము లిచ్చెదనన్నను, ద్రౌపది ధర్మము నకుఁ గట్టుపడి రెండే కాని మూఁడవది కోరననియె ఇది మతియొక గుణవిశేషము
లగ్గ + ఎగ్గ (మేలు, కీడు)
ఎఱుక - ఎఱుఁగుధా 'క్ర'
ఉత్తమపురుషుని యుత్తమగుణములు (61 వ)
ధృతరాష్ట్రిఁడు ధర్మజు ననునయించుట (62 వ)
పాచి - పాయుధాతు ప్రేరణార్థకము
క్రన్ననక్ - రూపాం - క్రన్నక్ = త్వరగా
ఉద్ధరించెక్ = లేవనెత్తెను
తరలము — న,భ,ర,స,జ,జ,గ

12 వ యక్షరము యతి

మత్తకోకిలము — ర,స,జ,జ,భ,ర

11 వ యక్షరము యతి

---

## (4) అహింసాస్వరూపము

[కౌశికుఁ డను బ్రాహ్మణునకు ధర్మవ్యాధుఁ డనుకిరాతుఁడు ధర్మసూక్ష్మము నెఱింగించు సందర్భమున వచ్చినది కౌశికుఁడు తపశ్శాలి యతఁడొక చెట్టుక్రిందఁ గూర్చుండి తపస్సుచేయు చుండ మీఁదనుండి కొంగ రెట్ట వైచెను ఇతఁ డలిగిచూడ, కొక్కెర తోడనే చచ్చిపడె మాధ్యాహ్నికభిక్షార్థమై గ్రామములోనికిఁ బోయి, యొక బ్రాహ్మణ గృహమున నీతఁడు భిక్ష మడిగెను బ్రాహ్మణి భిక్ష తెచ్చునంతలో నా మెభర్తవచ్చుటచే, నతని కుపచారములుచేసి వచ్చునప్పటికి జాగయ్యె

కౌశికుఁడు మండిపడెను నీకోపమునకు నేఁ గొక్కెరను గా నని యాపతివ్రత సమాధానము చెప్పఁగా నతఁడాశ్చర్యపడి వేఁడ నామె ధర్మవ్యాధునికడ ధర్మసూక్ష్మములు నేర్చుకొమ్మని పనుప వచ్చినవాఁడు. ధర్మవ్యాధుఁడు మాంసవిక్రయ మను కులాచారము నడుపు కిరాతుఁడయ్యును, జాతిస్మరత్వము మాతాపితృభక్తి ధర్మజ్ఞత గల యుత్తముఁడు ]

91 ఎవ్వరికి నేర నగు? = ఎవరు గ్రహింపఁగలరు ?

నేరువక్ - అనుటకు నేరక్ అనుట విశేషము

చూవె - నిశ్చయార్థకము, రూ చువె, చువ్వె, చూ, చుమి, చుమ్మి, చువీ, చువ్వీ

భూతములు=ప్రాణికోటులు నానా - పంచభూతములు, పిశాచములు

పుట్టినవి, జరిగినవి

భక్ష్యము=(తినఁదగినది) తిండి, పిండివంట

ఆహారమైదువిధములు - భక్ష్యభోజ్యలేహ్య చోష్యపానీయములని

అస్ఖలితము = (జాఱనిది) స్థిరమైనది

శ్రుతులు = (వినఁబడునవి) వేదములు

వేదములు మొదట ధ్వనిరూపముననే పుట్టినవి

అప్పటికి లిపి లేదు

శిబిచక్రవర్తి శరణాగతరక్షణధర్మము పరీక్షింపఁ దలఁచి యింద్రుఁడు డేగయై పావురమైన యగ్నిని తఱిమికొని వచ్చినపుడు, తన్నుశరణుచొచ్చిన పావురమును గాపాడ శిబి తన మేని మాంసమును దాని యెత్తు కోసి యిచ్చెను

92 పితృశేషము - విఘసము, దైవతశేషము - అమృతము

"అశ్వాలంభం గవాలంభం సన్న్యాసం పలపైతృకమ్,
దేవరాచ్చ సుతోత్పత్తిః కలౌ పంచ వివర్జయేత్"

హాలికుఁడు - (హలము-నాఁగలి కలవాఁడు) = వ్యవసాయదారుఁడు
ఓజ = క్రమము
సీర+అగ్ర = నాఁగటితుద
జంతులు = జంతువులు - 'వు' లోపము
దోషజ్ఞ! = పండితుఁడా!
ఊహింపుము + ఆ = సంప్రార్థనార్థకము
దేహయాత్ర జీవయాత్ర = పొట్టపోసికొనుట, మనుగడ,
తారు-రూ-తమరు, తాము
తొడరు = సంభవించు
నిపీడనము = మిక్కిలి బాధించుట (త్రుంచుట కోయుట మొ)
ఎడ = దూరము - నానా, సమయము, స్థలము అందు (ఉదా-
నాయెడఁ)
దురవబోధంబు = దుః+అవబోధము = దురవగాహము తెలి
య రానిది

---

## 5 ఉత్తరసారథ్యము.

[పాండవు లజ్ఞాతవాసకాలమున విరాటునిపురి నున్నవారని, యుం
డిరేని విరటునికిఁ దోడుపడుదు రని, బయలుపడుదు రేని సమయభంగ
ము చేయ వగునని, యెంచి విరటుని పశుగణములను బట్టుటకు ముందుగ
దక్షిణమునను సుశర్మను బంపి యోధుల నెల్లర రానిచ్చి పిమ్మట
నుత్తరగోగ్రహణమునకై దుర్యోధనాదు లెల్లరు రాఁగా వారి నెదు
ర్కొనుటకై యుత్తరుఁడు పోఁదలఁచినప్పటికథ యిది ]

98 ఈప్రశస్తపద్యమున, (1వ) కౌరవసైన్యము నడచుచున్నట్టిచొప్పు వీరశృంగా
రముల సమ్మేళనము దెలుపుచున్నది. అనుమచ్చనిచోట్ల లోతుగాంప
ములవలెను, ఎఱ్ఱనిచోట్ల, చిఱుతపగతెలు, తెల్లనిచోట్ల తూఁబోదలవలె నెను

పసపుపచ్చనిచోట్లు పుప్పొడులవలెను, అయి సైన్యము నడుచునప్పు డెగ
సిన ధూళి ప్రమదావనమువలె నున్నట్లుత్ప్రేక్ష

నలిఁగ = చక్కఁగా

కాఁపు = కాఁపురము

గోడిపడఁగ = అణఁగఁగా

పూవు + పొద - పూఁబొద, ప్రాఁతాదులవలె నిందు లుప్తశేషమును,
నుగాగమమును

పూవు + పొడి = పుప్పొడి లుప్తశేషమును, పూర్వప్రాస్వమును, పైహ
ల్లునకు ద్విత్వమును సిద్ధించినవి

94 భయభ్రాంతునిస్వభావము

గరుపాటిన = గగుర్పొడిచిన (శరీరము)

తలఁకు మనము = చలించిన మనస్సు

ఉచ్చవడిన = నిశ్చేష్టమైన (చూపు)

భీష్ముఁడు, ద్రోణుఁడు, కృపుఁడు మొదలయిన యోధవర్గమును భయం
కర మయినది దుర్యోధనుఁడను గ్రీష్మర్తువునందలి చండభానుని పరా
క్రమములచే వ్యాప్తమైనది, శస్త్రాస్త్రములయొక్కయుగ్రత చే ప్రకా
శించుచతురంగబలములచే వేడిదమైనది; దేఱు త్తయినబెక్కుములను జ్వాల
లతోఁ గూడినది

అస్త్ర - మంత్రపూర్వకముగఁ బ్రయోగింపఁబడునది

శస్త్ర - కత్తియున్నగునాయుధము

అకృతాస్త్రుఁడఁగ =ఊత్తమపురుష విశేషణము = అస్త్రవిద్యాశేర్వాని
వాఁడను

వెట్టిదులు = కూరులు

కోలఁది = శక్తి

మార్కొనమి =మార్కొను, వ్యతిరేకభావార్థకము

95 "ప్రాణములు తీపన మున్వినవే, బృహన్నలా!" ఇది, నానుడి యైనది.

దర + హసిత = చిఱు + నవ్వు

ఆమిషము = లాభము, ధనము, (మున్ను, గోధనమె ధనము) నానా భోగ్యవస్తువు, మాంసము

నెఱ + మనము=నెమ్మనము

ఎలుఁగుపడఁగక = ఎలుఁగు + పడఁగక = కంఠస్వరము తగ్గఁగా

దయ్యము = దైవశబ్దభవము

ఉత్తరుని పిఱికితనపుమాటలు నవ్వు పుట్టించుచున్నవి

96 పోక - పోవుధా కృదంతము = పోవుట

లోకముచక్కటి = లోకధర్మము

చిందము = శంఖము

ఉరవడి = కడువేగము

అగ్గలికము = అతిశయము

వర్మము = కవచము

బరవసము = పరాక్రమము

క్రిందు = ఆపద

నవ్వరెట్లు ='ఎట్లు నవ్వరు? అని యన్వయము

బాసట = తోడు

లేర = లేరు+అ - నిశ్చయము

వెడమాటలు = వ్యర్థభాషణములు

వెగడు = భయము

తెగడు = నిందించు

అగ్గించి = స్తుతించి

కొంపోవు = కొనిపోవుటకు విశేషరూపము రిత్త - రిక్త (తత్సమ)

ఊరక

కదుపు = పసులమంద

పెట్టించి = విడుచునట్లు చేసి

పల్లటిల్లన్ = వెలవెల పోఁగా

ఆఁగుదా ౯పే = ఆఁగు = అడ్డగించు

పిటిఁబోవన్ = చెడునట్లు

కుత్సించుచున్ = నిందించుచు

బీభత్సుఁడు = శత్రువులను యుద్ధములలోఁ గలఁతపఱుచువాఁడు.

99 బృహన్నలను జూచి యజ్ఞులు నవ్వుచున్నారు, ప్రాజ్ఞులు వస్తుతత్త్వ

మును గనిపెట్టుచున్నారు (**25** పద్యము)

ఊష్మలత = తైక్ష్ణ్యము, శౌర్యము

'వికృతవేషావృతంబులై' - యనన్వయము

'వికృతవేషావృతంబునై' యనుట యొప్పు

నివుఱు = రూ నీఱు నిప్పుమీఁది తెల్లనిపొర

పేడి = నపుంసకుఁడు

(పేడె = గడ్డము మీసము లేనివాఁడు)

దొరకొనక = (దొరకక) సిద్ధపడక

100 పరి = సేన

ఎయిదు-రూపాం, ఎద్దు = వెంబడించు

తటతట - కొట్టుకొనుట యందైన యనుకరణము

పెలుకుఱు = భయాదులచే విహ్వాలించు

కరటిదశకము = పదియేనుఁగులు

101 నాతోడిౘ్ఛేముడి = (నాతోడన్ + ప్రేముడి)

సమాసమున, చేత తోడ వలనల కిత్వంబు

ప్రేముడి - ప్రేమయనుటకు వైకృతము

అంబకున్ = అమ్మకు

చేతఃప్రీతి - ఇందలి విసర్గము ఉపధ్మానీయము

పొడసూతుర్ = కనుఁగొందురు

అన్న - ఆదరార్థకము.

పోటు = యుద్ధము

చిచ్చుఱపిడుగు = అగ్నిమయమైనపిడుగు - (నిప్పులొలుకునది)

తత్సమసమాసము - అగ్నిమయాశని

ఒడఁబాటు = సమ్మతి, ధా=ఒడఁబడు - కృదంతము

---

## 6 అభిమన్యువివాహము

[ఉత్తరునికి లభించిన దనుకొన్నవిజయము బృహన్నలదెయనియు, నతఁడు విజయుఁడె యనియు గ్రహించి, సంతసించి, విరటుఁ డతనికిఁ దన తనయ నుత్తరను గానుకగా సమర్పింపఁ దలపెట్టఁగా, నర్జునుడు ధర్మాను మతమునఁ దనతనయున కిమ్మన్న సందర్భమందలి కథ ]

**102** వైవాహిక సావధానుండు = వివాహప్రయత్నములయందు శ్రద్ధ గలవాఁడు

మౌహూర్తికులు = ముహూర్తముపెట్టువారు (జ్యోతిష్కులు) జాతక, ముహూర్త, సిద్ధాంతము లని జ్యోతిషభాగములు మూఁడు

లగ్నము - ఇచట, నిర్ణీతసమయము, మేషాదులు పండ్రెండు లగ్నములు లేక, రాసులు

వివిధప్రసాధనశోభితులు = నానాలంకారములచే నొప్పువారు

భద్రగజము - ఉత్తమజాతియేనుఁగు. భద్ర, మంద్ర, మృగము లని గజజాతులు మూఁడు

మట్టపుధట్టంబు సేసిఁకొని = కొలఁదిసేనఁ గూర్చుకొని

ధట్ట = సేన మువర్ణకము చింత్యము

క్రంత = వాదుకలో, కంత, పెండ్లికొడుకు వారు పెండ్లికూఁతు వారికి, దీసికొని పోయెడు బహుమాన ద్రవ్యములు. నానా, సందు, రచ్చ, రంధ్రము

తూర్యము = వాద్యవిశేషము.

మాగధ — వంశక్రమముగ పరాక్రమాదుల నుగ్గడించువాఁడు

వంది=ఒకవ్యక్తియౌదార్యాదికమును స్తుతించువాఁడు )సూతుఁడు

జయపెట్టువాఁడు )

ఈ ముగ్గురును బట్టుజాతివారె

విరటునియెదురుసన్నాహోత్సవము (2వ ప )

విహితపరిపాటితోఁ =విధి ననుసరించి (విధిక్రమమున),

సాంవత్సరికులు=జ్యోతిష్కులు

వీనులఁ —నిత్యబహువచనముగాఁ బ్రయోగింపఁ బడుచున్నది

చెవులయందు

తియ్యము=ప్రీతి

విన్కి =వినికి-వినుధా॥కృ॥

ఊను--పూను (ఆదిహల్లోపము)

ఇట్లు నెగయు పోవు హెచ్చు మొ

ఉవ్విళులూరు= ఆశపడు

మారవికారము=మోహము

అవలోకనము- రూ- ఆలోకనము= చూచుట

తివుట+ మై=కోరిక+తో

వ్రేఁగుపడిన చాడ్పునఁ =చిక్కుపడినట్లు

ఎఱుకువ = జ్ఞానము (భావము)

తా. కథూతురుల పరస్పరావలోకనములు నఖశిఖ పర్యంతము వ్యాపించి యనురాగమును వెల్లడించు చున్నవి (7 వ పద్యము)

104 దోయిళులు-దోయిలి (ఏక॥ వ॥) దోసిలి (రూపాం) నినుపు + ఒం
దర్ = నిండు పడునట్లు, (పూ_ర్తి) అక్షతప్రికరము = నేసఁబాలు'
తలఁబాలు పోసిరి = ఇట, ఆత్మనేపదార్థకము (పోసికొనిరి)
అలం॥—ఉపమ
విచ్చలవిడి = స్వేచ్ఛ
వెరవు = ఉపాయము
(cf-వెఱపు, వెఱఁగు)
పచరింతురు (ప్రచారింతురు తత్స) పఱపుదురు
చిత్తమునగాఢరాగము-అలుక్సమాసము
రాగము = ప్రేమ, రక్తిమ
ఉత్తరమనసులోని యనురాగము చేయి చాఁపఁగానే చూపినట్లు
రక్తిమ కనిపించుచున్నది అలం॥ ఉత్ప్రేక్ష పల్లవాలంబిమత్తేభలీ
లర్=చిగురు పట్టుకొను మదపుటేనుఁగు రీతిని, అలం ఉపమ
కాలునేతులు రక్తవర్ణము లగుట భాగ్యసూచకమని సాముద్రికశాస్త్రిము-
పెనుఁగుదుటర్ — పెను+కుదురు+అన్ = పెద్దపాదులో
1 ——2 ——
1 ను గాగమును 2 టు వర్ణము ఔపవిభక్తికము
చూతము = మామిడి చెట్టు
నవమాలిక = విరజాజితీవ.
అలం॥—ఉపమ

105 ఉత్తరాభి మన్యుల పరస్పరానందసమ్మేళనము (14 వ పద్యము)
వర్ణనము స్వభావసిద్ధము
క్షత్రియులు ద్విజులలోని వారు కావున, వివాహాదులందు హోమాదిక
ములు గలవు

గెడగూడ = జత గూడ

ఎయిదిన = పొందిన, ముట్టిన

ఊఱట = విశ్రాంతి (ఊఱడు ధాతు॥కృదంతము)

తలతాఁకులు = తలలను (మొనలను) తగులునవి

మవ్వము = సొగసు, కోమలత్వము

మార్గతి = మాఱు + గతి, (అన్యమార్గము) —శకటరేఫము సంయుక్తమున రేఫ మగును చొక్కు = పారవశ్యము (చూ॥ చొక్కుమందు, చొక్కుపొడి)

పెన్నిట్టు—పెన్ + నిట్టు = పెద్ద + ప్రవాహము సమ్మదాంబుధి—రూపక సమా॥

---

## (7) శ్రీ కృష్ణునిరాయబారము

[పాండవులు సమయము చెల్లించి వచ్చి తమపాలిమ్మని సంజయుచే రాయబారము నడపిన దుర్యోధనుఁ డొడంబడమిచే, కులనాశమునకుఁ దలంకి సామరస్య మొనర్చి యెట్టు లయిన సంధి సమకూర్ప మని సమర్థుఁడయిన శ్రీ కృష్ణుని ధర్మరాజు పంపిన సందర్భము]

**106** జలదస్వనగంభీరతన్ = మేఘధ్వని (ఉఱుము) వంటి యాడంబరముతో

ఎలుఁగు = కంఠధ్వని (నానా ఎలుఁగుబంటి) దీప్తి = కాంతి

చవులన్ = రుచులతో (శ్రావ్యముగా)

మేఘోపమానము శ్రీకృష్ణుని శరీరమునకుఁ గలదు, కావుననె వాక్కులు ఉఱుములవలె, దంతకాంతులు మెఱుములవలె, నుండుట సమంజసము

భూవిభునకున్ = భూవిభునితో

—వ్యా॥ వచ్యర్థాఽముఖ్య కర్మంబునకు 'తోడ' 'కు' వర్ణకంబులు ప్రాయికంబుగ నగు

సభలలో నెట్లు భాషింపఁదగునో కృష్ణునియొత్తుగడలోనె వెల్లడి యగు చున్నది

భారతాన్వయప్రియము = భారతవంశమువారికి మేలు

క్షీరోదకగతి-పాలు నీరు వలె (క్షీరనీరన్యాయము)

సద్గుణోత్తరులరు-మధ్య, విశేషణము

= మంచి గుణములచే శ్రేష్ఠులయినవారలు

(తృతీయాతత్పురుషము)

శుభ శీలురు—బహువ్రీహిసమా॥

దీర్ఘపూర్వక లకారోపధాదంత సంస్కృతసమ మహచ్ఛబ్దములమీఁది 'లు'ల లకు రుర లాదేశంబు లగును

లోనిపొత్తు జనస్తుత్యముల్ కావింపం దగు

నీమనసులోనిది క్రియలోఁ గనఁబడుప వలయునని భావము

కుటుంబములోని వారు తెచ్చిన మంచిచెడ్డలు యజమానునకు వచ్చును.

ఇది లోకధర్మము

సుయోధనుఁడు = దుర్యోధనుఁడు

నాక = అనక

పుయిలోడరు = వెనుదీయరు

**107** తెలుఁగు = సంధి, నానా, విధము (7 వ ప)

పోరితము = పోరు (యుద్ధము)

వలసినక = ఇష్ట మగునేని

తీర్పంగ నేర వచ్చుక = చక్కఁబఱుప నగును

వీరలఁ జేర్చుట = వీరిని ప్రసన్నత నొందించుట

నెఱి = న్యాయము

అనిక = యుద్ధమునందు

ఈల్గుట = చచ్చుట, నీలుగురొుక్క. రూపాంతరము.

సముద్రవేలావృతోర్వి = కడలిచెలియలికట్టచేఁ జుట్టఁబడిన పుడమి.

(సకల భూమి)

**108** ఉపేక్ష + అపేక్ష

చావు = చచ్చుధా॥ కృ॥

నొవ్వు—నొచ్చుధా॥ కృ॥ రూ॥నొప్పి

ఎవ్వారికి వచ్చిన మేలు? ఎవరికివచ్చినను మంచిది కాదు

ఇరు వారు = కౌరవ పాండవులు

రిత్తబవరము = వట్టి పనికిమాలినయుద్ధము

ఆఱడి చావు-నింద్యమైన మరణము

యుద్ధము నాశహేతువని శ్రీకృష్ణుని హితబోధ

యుద్ధమైనయెడల, పాండవులకె విజయము కలుగును నీరాజ్యము పోవును నీకపఖ్యాతి వచ్చును తరువాత పరితాపము కలుగును అను భావము వచ్చునట్లు "నీదు ప్రాభవంబు నీతియు శాంతియుఁగాచికొను" మని శ్రీకృష్ణుఁడు చెప్పెను (14 ఐ ప)

**109** ప్రజలు = బిడ్డలు

పదుమూఁడగు నేఁడు - పదుమూఁడవ యేఁడు.

(ఏడు = ఆఱు నొకటి)

అజ్ఞాతవాసము = తెలియకుండునట్టి యునికి

"పదివేలేండ్లకు"—ఎన్నఁటికిని (జాతీయము)

ఒక్కరూపు = ఒక్కవిధము

కొఱగాకున్నన్ = పనికి మాలినను

ధర్మము పాపముచేతను, సత్యము బొంకుచేతను చెడునని యన్యాయము ఇట్టి దాని నుపేక్షించువారికే యాపద యగును ధర్మసత్యములందు దైవ ముండును (18 ప)

**110** మనోవాక్కాయములు త్రికరణములు.

క్రోధమానమాత్సర్యములు - కోపము, గర్వము, చలములేక ద్వేషము (ఇవి యరిషడ్వర్గములోనివి)

చెపుఁడ = చెప్పుఁడీ! [పకారద్వయలోపమును, సంప్రార్థనార్థకమైన ఆకారమును ]

అర = భేదము

దశ = అవస్థ, స్థితి,

అజాతశత్రుఁడు - వ్యు॥ శత్రువులు పుట్టనివాఁడు, ధర్మరాజు, ఇతనికి మనసులో నెవ్వరియెడను శత్రుత్వము లేదని భావము

ధర్మరాజాదులు అణఁగి మణఁగి యున్నారని మాత్రమె యెన్నకు, వారు బలవంతులె సుమా యని శ్రీకృష్ణుని సూచన

111 మదిమదినుండక = నెమ్మదిగా, నిశ్చింతగా నుండఁగా

భుగ్నులు + కాక = వంగినవారు + అగుచుండఁగా

పెడచేతఁ గన్నునీ రొత్తుకొను—స్వభావోక్తి

(దుఃఖమును దిగమింగి)

అపకారులతో నైనను పొత్తు గోరుచున్నాఁడు,

ఇది ధర్మజు గుణవిశేషము

తనుఁ దాన పోలుఁ గాక = తనకు సాటి తానే కాని (అనన్వయాలంకారము )

ఇరు దెఱఁగు = రెండుపక్షములు

సమా॥ ద్విగువు ద్విగువున కేకవచనము ప్రాయికముగ నగు

112 శాంతశూరులు = సమయము వచ్చువఱకు శౌర్యము నణఁచి శాంతము వహించువారు, (నివురు గవిసిన నిప్పు లట్టివారు )

పథ్యము = హితము

నెఱి = క్రమము

రోమహర్షణము, రోమాంచము = గగుర్పాటు అనువు + అరి = వెరవరి, ఉపాయశాలి అరి - మతుబర్థకము

అచలాకృతులు = కదలని స్వరూపములు కలవారు

అచల—నక్షత్ర॥ అచలాకృతులు = బహువ్రీహి

---

## (8) మంకి చరిత్రము

[ధర్మరాజు శరతల్పగతుఁ డయి భీష్ముని ధనలుబ్ధుఁ డయిన పురుషునకు సుఖమెట్లగు నని ప్రశ్నింప, నందులకు శాంతనవుఁడు చెప్పినయితిహాసము ]

131 కోడియ-రూ, కోడె=దున్న నీడువచ్చిన దూడ (1 ప)

పోని=పోలిన

వత్సతరములు - కోడెదూడలు

అకట! = సంతాపార్థకము

నిర్వేదనము = విచారము

దైవము పౌరుషముకంటె హెచ్చు (2)

దైవము = అదృష్టము (భగవంతుఁడు)

పౌరుషము = పురుషకారము, మనుష్యయత్నము

ఇట్లు "క్షేత్రంబు పురుషకారము
  ధాత్రీశ్వర ! బీజ మరయఁ దైవము రెండున్
  సూత్రపడఁ గూడెనేనిన్
  బాత్రి మగున్ గర్మకరుఁడుఁ ఫలమున కొంకున్"

అర్థ భంగుల్ = ధనవిషయమైన యుపాయపద్ధతులు

ఉరవు = (గొప్ప) ఔచిత్యము

ఉత్సారణంబు = కదలించుట, పోఁగొట్టుట

సంకల్పావమర్శము = ఉద్దేశముయొక్క యొరయిక
తుదియది = దానితో సరి (అనివాడుక)

114 చెడుట చావుతోఁ దుల్యము—ధననాశము ప్రాణసంకటము.

ఇచ్ఛానిరసనము సుఖము='నిరాశా పరమం సుఖమ్' (3 ప)
తృష్ణ = ఆశ, నానా దాహము
కావించెదఁబో = నే సంపాదింతునే యనుకో
(అది పోవుచుండ, నీవాఁపఁగలవా ?)
నిండుట = తృప్తి (12 ప)
రసాతల భంగి=పాతాళము వంటిది (అగాధము)
నీవు చన్పొలమునన్ = నీవు పోవుచోటున
బచ్చెన = పూఁత, వర్ణము
బచ్చెనరూపు పోఁకలన్ = కృత్రిమమార్గములచేత

115 శాంతి-శమము (కామక్రోధాదులు లేనిస్థితి) అంతరింద్రియనిగ్రహము

దాంతి=బాహ్యేంద్రియ నిగ్రహము, తపఃక్లేశము నోర్చు శక్తి
క్షమ=ఓర్పు, సహనము
చెందినాఁడ (చెందిన+వాఁడ) ఉన్నకలన వర్ణంబుల మీఁది తచ్ఛబ్ద వకారలోపము బహుళము
(ఐహికాముష్మిక ద్వంద్వాతీతమైనదె సుఖము)
కామసుఖ పోలలేవు-తా-ఐహికాముష్మిక సుఖవాంఛలను విడుచుట వలనఁ గలిగెడు మేలులో నీవు పదునాఱవ పా లయినను సరి కానేరవు (14 ప)
చచ్చినంబుట్టిన = చచ్చుటచేతఁ గలిగిన
ఫలితార్థము—ఆశాపరిత్యాగము పరమసుఖకారణము

## (9) గరుత్మంతుని చరిత్రము.

[ధర్మరాజు భీష్మునిఁ దనధర్మ సందేహము లడుగు సందర్భమున వచ్చినది.]

కశ్యపుఁడు—ఇతఁడు దేవదైత్యాదులకు జనకుఁడు
బ్రహ్మమానసపుత్త్రిుఁ డయిన మరీచికి కళాదేవికి, జనించినవాఁడు
పదుమైదువందల యేండ్లకు కద్రువ వేయియండము లవిసెనవి

116 సవతి-సపత్నీతద్భవము అనియతిఁ =యుక్తకాలము రాకుండఁగానే.

117 పులుఁగు = పక్షి, ఒక్కఁడు = ఒక్కటి (4 ప)

పూర్వాంగము = ఊర్ధ్వకాయము

ఉల్లము = మనసు

నివ్వెఱపడి = నిండు, వెఱ(గు), పడి (5 ప)

అండజంబు = గ్రుడ్డునుండి పుట్టినది

వినతకుఁ గలిగినశాపము (6 ప)

పెనుపు = పెనుచుట, వృద్ధి

చాపలము = చాంచల్యము, (వాంఛ)

పరవుడు = దాసి, (పరవుడము = దాస్యము)

అలుకుచుఁ = భయపడుచు

అనుజుఁడు (తమ్ముఁడు) × అగ్రజుఁడు (అన్న)

మహోగ్ర మూర్తి = మిక్కిలి భయంకరమైన తేజస్స్వరూపుఁడు

ఈఁగుఁ = పోఁగొట్టును

118 సుపర్ణుఁడు=(మంచి ఱెక్కలుగలవాఁడు) గరుత్మంతుఁడు పరిస్ఫుట దివాకరుండు=ప్రకటమైనకాంతిచే పోల్పఁబడిన బాలసూర్యుఁడు గలవాఁడు అనఁగా బాలసూర్యుని తేజస్సువంటి తేజస్సు కలవాఁడు (ఎఱ్ఱనివాఁడు) లోకనయన కారి-కన్నులపంటు వైనవాఁడు

**ఈ** పద్యమున, గరుడుని యంగసౌష్ఠవము అచ్చున గుద్ది నట్లు పాడ కట్టు చున్నది. (11 ప)

**అరుణుడు** = ఇతఁడే యనూరుఁడు ,

ఇతఁడు సూర్యసారథి యయ్యె

తన యిచ్ఛ— స్వేచ్ఛ (తత్స)

చంచువు = పక్షిముక్కు (15 ప)

సోలము = మత్తు, చొక్కు

తరఁగ = అల (తరంగశబ్దభవము)

పదుపు - రూ - పదువు = గుంపు (తిర్యక్సమూహము)

నడబెడఁగు = నడక సొగసు

వన సౌందర్య మిందు వర్ణితము

'ఓ' సందేహార్థకము - అలం-ఉత్ప్రేక్ష (17 ప)

మనోజ్ఞ సితచ్ఛవి = అందమైన తెల్లరంగు

కరువు = మూస లోహాదులు కరఁగి పోయుటకు నడుమ సందుంచి కట్టిన మట్టిదిమ్మ

గండరువు=పడియచ్చు కరువు

దవు దవ్వులన్-రూ-దవ్వుదవ్వులన్, దాదవ్వులన్, దాదాలన్

కడు దూరమున (ఆమ్రేడితము)

చారులోచనలు=చక్కని కన్నులు గలవారు (సుందరులు)

ఉచ్చైశ్శ్రవము - వ్యు - పెద్ద చెవులుగలది

తెల్లగుఱ్ఱము - పాలసముద్రమునఁ బుట్టినది

అపరాంగము = వెనుకప్రక్క, పిఱుందు

నీలిమ = నైల్యము

120 నవ్వులకున్ +ఆడితివి+ఓ=పరిహాసమున కుటచితో ; నీదుచూపు నకుఁ బోలినభంగియో=నీదృష్టికి యట్లున్నదో ! (20 ప)

తెరలన్ బలుకన్ = వివరించి చెప్పుటకు

వాదు - వాదము (తత్స), వాదుకలో నిందార్థకము

సంవాదము = సాదృశ్యము (సమాధానము)

కడింది = గొప్ప

పన్నిదము చఱుము = పందెము వేయుము

తెగఁ బాతి = సాహసించి

ఇయ్యకొనియెన్ = అంగీకరించెను (రూ॰ ఈయకొను, ఈకొను)

121 ఒడ్డారమునకున్ = మా ఱొడ్డుటకు, ప్రతిఘటించుటకు, చేయరన్న —చేయుఁడు+ అన్న, చేయుడీ ! వ్యా॥ సంప్రార్థనంబునం దెదాదు లనుప్రయుక్తంబు లగునపుడు వుడీ, రుడీయగు (27 ప)

121 వాసుకి ప్రభృతుల ధర్మగుణముఁ దెల్పుచున్నవి (28-29 ప)

ఎక్కడేని-ఎక్కడ నేని-(ఎక్కడకో)

122 అమృతకరాన్వయము = చంద్రవంశము

గొంతి - కుంతి - వైకృ॥

123 కద్రువ తనమాట విననికొడుకులకు శాపమిచ్చుట, శృంగిశాపముచే సర్పదష్టుఁడై చచ్చిన తనతండ్రి పరీక్షిత్తు తృప్తికై జనమేజయుఁడు సర్పయాగము చేసెను (32-వ ప)

ఆదహన తాపమునన్ = ఆయజ్ఞాగ్నియొక్క భయంకరమైన పెను మంటలలోఁ బడుట వలనఁ బుట్టిన మహాపరితాపముతో.

తక్కటి నాగములు = మిగిలినపాములు.

వాలధి = తోఁక

వరవుడవు = దాసివి

పరిచారికాకృత్యము = దాసి చేయఁదగినపని

అలంచు = బాధపెట్టు

124. అగ్గలింపన్ = అతిశయింపఁగా. (37 ప.)

ఉపలాలన = బుజ్జగించుట

ఒకయప్పుడు = ఒకప్పు డనుటకు విశేషప్రయోగము

సవతాలు (సవతి+ఆలు) సవతి

చింతవంత - జంట మాట

125. ఎఱఁగి = నమస్కరించి (43 ప)

నేర్మి - నేరిమి = నేర్పు, సామర్థ్యము (గొప్ప)

126. విడ్వు - విడుపు - విడుచు ధా॥ కృదంతము =విడిపించుట విడుదల.

మొఱకటించుకొను = త్రిప్పుకొను

ఈర్తు = ప్రేమగలవాఁడవు

ముదంబును నచ్చెరుపాటు = సంతోషాశ్చర్యములు

127 పొదిగొని = గుమిగూడి (50)

జల, వహ్ని, భట దుర్గములు మూఁడు

బలియుఁడు = బలవంతుఁడు 50

128 గారు = ఏనుఁగు

129 మధుఁడు కచ్ఛపము (తాఁబేలు); కైటభుఁడు దంతి (ఏనుఁగు)

కంటు—కనుట (కనుధా॥ భావార్థకము) 57

వీఁక = కడిమి 61

130 వీడ్కొను, విడుకొను—శబ్దపల్లవ = సెలవుపుచ్చుకొను

తేరక—తెచ్చుధా॥ తుమున్నర్థము (తేన్)

పక్షతి ప్రజంబు = ఱెక్కలగుంపునఁ బ్రకాశించు కాంతి సమూహము 63

నీరికిక = నీటికి - షౌపవిభక్తికము లేనిరూపము 64

నీరువట్టు = దాహము 65

131 మునికాళ్లను = ముందటికాళ్లతో సాము = సగము

వలకాలు = కుడికాలు 67

వామపాదము = ఎడమకాలు

కచ్ఛ+పము = కచ్ఛముచేఁ ద్రావునది, తాఁబేలు

ఒరలంబడక = ఒరఁగిపోఁగా 68

ఆడఁదిపడు = ఎగసిపడు

వసంబు+ఏది = వశము తప్పి 69

మేఘయుగళీ కేళియోయనఁ = మేఘములజంటకలిగి యొప్పు

ధాతు చిత్రములుగల కొండయొక్క ఆకాశమునందలి యాటయో

యనునట్లు అలం—ఉత్ప్రేక్ష

132 పంచయోజనములనిడుపు=ఐదామడ పొడవు (70ప) ఎరఁగు = దిగు,

బిట్టు = శీఘ్రము 72

పల్లటిలు - పల్లటిల్లు = చలించు; వ్యత్యస్తమగు

ఒయ్యన - (క్రియావిశేషణము)=తిన్నఁగా, మెల్లగా

విశేష్యరూ - ఒయ్యన

వాలఖిల్యులు - తలక్రిందుగఁ దపస్సుచేయుమునులు

వైనతేయుఁడు, వినతాపత్యము = గరుడుఁడు (73)

133 పుళింద = ఉత్కళదేశమందలి కొండలమీఁది మ్లేచ్ఛజాతి (78)

అటఁ గొని = అటకుఁగొని (79)

వ్యా॥ కాలాధ్వములకుం బ్రాయికముగ ప్రథమయగు

చక్కటి - చక్కి = చోటు

ఆను=త్రావు (81)

అమృతమునకు - వ్యా ॥ నిమిత్తార్థకషష్ఠి

తన్మహోత్తరజిహ్వల = ఆయగ్నియొక్క పెద్దమంటలు (83)

తనుకు = జ్వలించు, ప్రకాశించు.

కేలుమొగిచి - చేతులుమోడ్చి (నమస్కరించి) (84 ప)

134 ఒకవెంటఁ = ఒకవిధమున (85ప)

విహితము = విధింపఁబడినది

నగుబాటు = పరిహాసము (పరాభవము)

అన్వేఅతోఁ = అను+వెఅతోఁ (ఉత్వలోపము)

అతనికి వత్సలుఁడు - అతనియెడ దయగలవాఁడనుటకు ప్రయోగ విశేషము (87)

ప్రమక్కఁబడుఁ = అడఁగిపోవును

ఆలమందలు - ఆవులమందలు (88)

వ్యాత్సారోదారుఁడు = ఎక్కుడు మనోబలముగలవాఁడు

అయోమయంబైన యజ్జాలంబు = ఇనుపతీఁగలతో నల్లిన ఆ వల.

తారావిథి=నక్షత్రమార్గము

(ఇందు) గ్రహింపఁబడిన గరుడుని సౌశీల్యములు —

(1) దేవాంశము—బ్రహ్మచేఁ బెరుఁగుట

(2) మాతృభక్తి—దాస్యమునుండి విడిపించుట

(3) దేహబలము—గజకచ్ఛపములను పంచయోజనాయతవృక్షశాఖను మోయుట

(4) విజయకార్యదీక్ష—జలాయుధ దుర్గముల భేదించుట

(5) ధర్మపరాయణత—అమృతకలశమును మరల నింద్రున కిచ్చుట.

(6) ఉపాయజ్ఞత—అగ్నిజ్వాలలను వెన్నముద్దలువేసి చల్లార్చుట

## (10) సత్యభామచేసిన యుద్ధము,

[లోకకంటకుఁ డయిననరకాసురుని జయింప శ్రీకృష్ణుఁడు వెడలునప్పుడు సత్యభామ తోడంబోయి తన ధనుర్విద్యా వైశద్యము భర్తకుఁ జూప యుద్ధము చేసెను రాజకన్యకలును ధనుర్విద్య నభ్యసించుట పూర్వాచారము.]

136 ధరాసుతుండు - వరాహావతారమున భూదేవియందుఁ గలిగినవాఁడు, నరకాసురుఁడు, లోకకంటకుఁడు గరుత్మంతుని మూఁపు మీఁద సత్యభామతోడి కృష్ణుఁడుచంద్రబింబముపైని మెఱుముతోనొప్పు మేఘముతోఁ బోల్పఁబడెను (1ప)

కనన్నిషంగుఁ = కనత్ + నిషంగుఁ = ప్రకాశించుచున్న యమ్ముల పొది గలవానిని

కుహనాచంగున్ = మాయలచేఁ బ్రసిద్ధుని = మాయలమారిని

రణాభంగున్ = యుద్ధమున నోటమిలేని వానిని (శ్రీకృష్ణుని)

అలం—అంత్యానియమము

గమకింపన్ = సిద్ధపడఁగా (2ప)

తమకింపక = తొందరపడక

చొల్లెము = మట్టు (3ప)

నీవి = పోఁకముడి

పయ్యెద-పై+ఎద పైటచెంగు

తుఱిమి = ముడిచి

137 యదురాజన్య శ్రేష్ఠుఁడు = యదువంశపు రాజులలో మేటి

యాదవులు—యదు వృష్ణిభోజాంధకు లని నాలుగు తెఱఁగులవారు.

అలం-యమకము

అలం-యమకము. (5)

లేమా = తరుణీ !

లేము+ఆ? = అసమరుర్థుల మా?

లే+మాను - లెమ్మి - మానుము = తొలఁగుము, పోరుడుగుము

లే+మావిల్లు = సిద్ధపడుము × నాచేతిలోని విల్లు

అలం-అంత్యప్రాసము (7)

బాణాసనము-వ్యు-బాణములు చిమ్మునది- విల్లు

తా దేవతలను సంతోషపెట్టునది,రక్కసుల భయపెట్టునది, శత్రువుల గర్వమడఁచునది

తదగణ్య ప్రతాపమునన్ = ఆ వింటియొక్క యపరిమితమైన మహా తేజస్సువలనఁబుట్టిన కార్యముచేత (8)

స+గుణము=నారితోఁ గూడునట్లు

నిర్×గుణము = త్రాళ్లుతెగునట్లు (వాడుక) విధవాత్వము వచ్చునట్లు.

నారి-తెలుఁగున-వింటిత్రాడు తత్సమమున — స్త్రీ (9ప)

రింఖణ = జాఱుట

బల×సంపన్న+అరి+ఇభ+ఆదికము = బలవంతు లయిన శత్రులయేనుఁ గులు మున్నగునవి

138 సత్యభామ తనూవిలాసము యుద్ధపరికరములతోడి సమ్మేళనమున వీరశృంగారాది రసములు మూర్తీభవించి నట్లు శోభించినది (10ప)

తొడుగుట, తిగుచుట, ఏయుట, యెఱుఁగ రాకుండననుట శరలాఘవ సూచకము

వీరశృంగార సమ్మేళనముఁ జిత్రించు మేలి పద్యము (11 ప)

విలుకాఁడు యుద్ధకాలమున నిలుచు విధము లైదు (12 ప)

1 ప్రత్యాలీఢము = విలుకాఁడు ముందఱకు నెడమకాలు సాచి కుడికాలు వెనుకకు గుడికాలునుంచి నిలుచుట

2 ఆలీఢము-కుడికాలుముందఱికి చాఁచి నిలుచుట

3 సమపదము-రెండుకాళ్లతో సమముగ నిలుచుట

4 విశాఖము-రెండుకాళ్లనడుమ జేనెఁడెడము గలుగనిలుచుట

5 మండలము-రెండుకాళ్లు గుండ్రముగఁబెట్టి నిలుచుట.

అలిక లతోఁ=నుదుటిచెమటలో నంటినముంగురులతో

ఆకర్ణ...దీధితులతోఁ = చెవులవఱకును లాగఁబడిన నారియొక్క యా గోటికొనలయొక్కయు కాంతులతో.

లక్ష్యావలోకంబుతోఁ=గుఱిచూచుటతో
వలయా రాతియై=చుట్టుదిరుగు వింటినుండి వెలువడు బాణసమూహ
ముచేఁ గొట్టఁబడిన శత్రువులుకలదై
(సత్యయొక్క ధనుర్విద్యాపాటవ మిందు వ్యక్తమవు చున్నది)
కన్యకా సిద్ధక్రీడలు యుద్ధ ప్రసిద్ధకృత్యములతోడ వ్యత్యస్తముగా
వర్ణింపఁబడినవి (13 ప)
చారు+సత్య+భా+మా = ఒప్పిదమైన సత్యము, కాంతి, సంపద కలది
(బహువ్రీహి) (14 ప)

140 సత్యయుద్ధము వర్షకాలముతోఁ బోల్పఁబడినది ధనుష్టంకారము
ఉఱుము, దేవతలు చాతకములు, విల్లు ఇంద్రధనుస్సు, కృష్ణుఁడు
మేఘము, సత్య మెఱుపు, బాణములు వర్షధారలు రాక్షసగణము
దావాగ్ని (15 ప)
ఇందు, యథాసంఖ్యాలంకారము (16 ప)
కేతువు = జెండా,
ధూమకేతువు = తోఁకచుక్క
పరిధి = పరివేషము, వృత్తము (circle) యొక్క సీమను సూచించు
గోళాకార రేఖ (circumference)

141 దానవానీకంబుల్-విచ్చెన్
అనీకము (సేన) నపుం॥ కర్తగనుక, క్రియ కేకవచనము
అంత్య ప్రాసము (19 ప)
మధుర సారి=తీయనిమాటల నమృతముఁ జిలుకువాఁడు
తదీయ వారి = ఆమె యుద్ధప్రయత్నము నాఁపువాఁడు
యమకము (20 ప)
దానవనాథుని కొమ్ము ఆహవమునకుఁ దొలఁగెన్ = రాక్షస పక్ష
మువారు యుద్ధమునకు విముఖులైరి

కై కొమ్మా.రూ॥కైకొనుమా కొమ్ము+ఆభరణములు

141. అంత్యప్రాసము (21 ప.)

కళావతి-విలాసము, విద్యలు కల దని సాభిప్రాయవిశేషణము

---

## 11 నృగ చరిత్ర

[శుకయోగి పరీక్షిన్మహారాజునకుఁ జెప్పినది నృగుఁడు సూర్య వంశ్యుఁడు ఇక్ష్వాకుతనయుఁడు పుణ్యశాలి అయినను, తెలియక దానము చేసియుండిన గోవునే మరల దాన మిచ్చుటచే నూసరవెల్లి యయ్యెను బ్రహ్మస్వ మజ్ఞానముననైన నపహరింప రాదనునీతియిందుఁ దెలుపఁబడినది ].

పిపాస = త్రావనిచ్ఛ (1 ప)

ఊసరవెల్లి = తొండ ముదిరినది

ఇల్లై, నక్క ముదిరి వఱడగు

పాశము=త్రాడు

కృకలాసము = తొండ (3 ప)

143 తెలియ కొఱకుఁ - తెలియుట కొఱకు (ట లోపము) (4 ప)

ఊసరవెల్లి తనము - త్వ ప్రత్యయార్థకము తనవర్ణకము

నిటలఘటితాంజలి యై-నుదుటఁ గూర్పఁబడిన దోయిలిగలవాఁడయి 6 ప'

చతురంత భూభరణ సామర్థ్యము=నాలుగు చెఱఁగుల నేలయేలు శక్తి

ఆత్మస్తుతి పాపహేతువు (9 ప)

అలం - అతిశయోక్తి.

144 సువర్ణ శృంగఖురములు = బంగారు కొమ్ములు, గొరిజలు (11 ప),

పంచ మహా యజ్ఞములు — (12 ప)

'పాఠో హోమ శ్చాతిథీనాం సపర్యా తర్పణం బలిః,

ఏతే పంచ మహాయజ్ఞా బ్రహ్మయజ్ఞాదినామకాః'

ధార - జలధార, దానము ధారాపూర్వకముగఁ జేయఁబడును

వాడుకలో "నీళ్లుపదలినాఁడు" (14 ప)

మొదవు = ఆవు (15 ప)

146 గోధనము = గోవు లనుసొమ్ము పూర్వము గోధనమె ధనము ఇప్ప టికిని తూర్పున పశువులను సొమ్ములనియె వాడుచున్నారు (18 ప)

147 కింకరులు - కింకర వ్యు॥ ఏమిచేయుదునని యడుగువాఁడు, సేవకుఁడు (21 ప)

పాపపుణ్యములలో కొలఁదిపాటిది ముందనుభవింప నగునని శాస్త్రము.

అనుభావ్యము = అనుభవింపఁదగినది

దురితనిస్తారకము=పాపము పోఁగొట్టునది

సామాన్యముగ నందఱు పఠించు పద్యము (24 ప)

148 పదంబులు ప్రణమిల్లి = పాదాక్రాంతుఁడై

విమానము = ఆకాశసంచారము గలది

---

## 12 లంకాదహనము.

[సీతాన్వేషణార్థము పోవని లంకకేఁగి రావణుంగని బుద్ధిగఱపఁ దలఁచి యశోకవని విఱుపగా రక్కసులు రావణునెదుటికిఁ గొంపోవ వతఁడలిగి తోఁకగాలుపుఁడన, వాలాగ్నితో లంకను దహించి చూచి రమ్మన్నఁగాల్చి వచ్చెనను సామెత పుట్టించెను ఇందు హనుమంతుని బల సాహస ధైర్యశౌర్యములు చూపట్టుచున్నవి ]

149 అబ్జగర్భుఁడు వలఁతియై యిచ్చినవరము (2 ప)

Aleusion —హనుమంతుఁడు పుట్టఁగానే సూర్యబింబమును పండని మ్రింగఁబోవ, ఆవేఁడిమికి మూర్ఛచెందెను తండ్రి వాయుదేవుఁడు కోపించి స్తంభించెను అందుచే లోకము లాకులపడెను అపుడు, బ్రహ్మాదులు నీకుమారుని బ్రతికించి వరము లిత్తుము- లోకవ్యవహారము నడుపుమని వాయుదేవుని వేఁడుకొనిరి అపుడు బ్రహ్మ యితనికి

బ్రహ్మదండ బ్రహ్మాస్త్రముల వలన హానికలుగకయుండ వర మును గ్రహించెను

అగుటయుఞ్ —అగుటయును, కాఁగా (4 ప)

వ్యా॥ భావార్థకముపై యువర్ణక సముచ్చయము అవంతర్యార్థకము

151 రావణుని రూపమునందు మేఘధర్మము నిరూపింపఁబడినది (11 ప)

అలం ఉపమ

సౌదామని = మెఱుపుతీఁగ

బలాకాళి = బెగ్గురుపిట్టలగుంపు

152 పటు బాహార్గుఁడు = మిక్కిలి ప్రకాశించు పదితలలచేతను, రత్నములతో దేదీప్యమానములయిన బాహువులచేతను భయము కలుగఁ జేయువాఁడు

కుటిల కులేక్షణుఁడు = వక్రము లయిన కనుబొమ్మ లనెడు పెద్ద పొగచే తీక్ష్ణమైన, ఘోరమైన, మిణుఁగుఱులచే విస్తరిల్లిన కోపాగ్ని జ్వాలలచే వ్యాప్తమైన చూపులు కలవాఁడు

ప్రోద్దష్ట వస్త్రుఁడు— గట్టిగా కఱవఁబడిన ప్రేలాడు పెదవుల పయిఁ జూపట్టు దంతములచే భయంకరమైన ముఖము గలవాఁడు

హాటక. జూటుఁడు —బంగరు కొండకొనవలె నొప్పెడి సిగముడి గలవాఁడు (13 ప)

జోటులు = స్త్రీలు

లోకవిద్రావణునిన్ = లోకభయంకరుని

ప్రహస్తుఁడు = రావణసేనాని (17 ప)

ఇందు, ప్రభువులు మంత్రులచేతనే యడిగించి గౌరవము నిలుపు కొనువా రని తెలియుచుండగును (18 ప)

తపన ప్రియనందనునకు సచివుఁడన్—సూర్యపుత్త్రుఁడైన సుగ్రీవుని మంత్రిని.

బవరము = యుద్ధము (23 ప)

చూ = సుమా (24 ప)

**154** బలిముఖ—బలిముఖ = వానర (27 ప)

**155** ధూర్జటివిలు—శివధనుస్సు (28 ప)

రాముఁడు సీతావివాహార్థము శివధనుర్భంగము గావించెను

రావణుఁడు త్రిలోకజయార్థమై పోయి కైలాస మెత్తినపుడు, శివుఁడు తన బొట్టనవ్రేలితో నదిమెను

(వాలి సముద్రతీరమునఁ దపస్సు సేయుచుండ, వెనుబాటునఁబోయి రావణుఁడు పట్టుకొన నతఁడట్టే రావణుంబట్టి సప్తసముద్రములలో ముంచి విడిచెను

(హోమధేనువునకై పోరఁజొచ్చిన కార్తవీర్యార్జునుని పరశురాముఁడు చంపెను)

బరులు=ప్రక్కలు (29 ప)

**156** సౌమిత్రి . బాణములు = లక్ష్మణుని భుజమందలి యమ్ముల పొది నుండి వెలుపడు రత్నపుమొనలు గల యసంఖ్యము లయి పుట్టుచున్న మిణుఁగురుల గుంపుచే పెచ్చుపెరుగుఁ మంటలుగల బాణములు 30 ప.

మతకరి = మతకము + అరి = మాయలమారి అరి - మతుబర్థకము.

జనకకన్య - తద్ధి - జానకి (35 ప)

నీకంఠార్పితకాలపాశము—ఏకదేశాన్వయము

నీమెడకుఁదగిలించిన యమపాశము వంటిది

శిరోనిర్ఘాతపాతము = నెత్తి పై పిడుగుపడుట

లంకాకస్సంచయకాళరాత్రి—లంకావాసులయినరక్కసులకుమారకళత్రి.

గళ . కాలాహి = మెడం దగులుకొన్న నల్లత్రాఁచు కన్యా+ఆకార+ఆగత+మృత్యువు = స్త్రీరూపమున వచ్చిన మృత్యుదేవత.

**157** **కుటిల ..ఘోరాస్యుఁడై** (**37** ప)
= వక్రములయిన కనుబొమలచే భయంకరమైన పది నుదురులును, అందలి పెద్ద ముక్కులును వ్రేలాడు పెదవులును, చెక్కిలి పైభాగము లును, కదలు చున్న పెద్ద కోఱలును, గలుగుటచే క్రూరమైన మొగము గలవాఁడయి.

**158** నీకోపమునకుఁ దగఁ డితఁడు అష్టదిక్పాలకులలో నెవ్వఁ డితఁడు?
దూతకు విధింపఁబడిన శిక్షలు **39** ప
1 కొరడాదెబ్బలు 2 తల గొఱుగుట 3 అవయవములలో నేదో యొకటి నఱుకుట
కార్పాసపట్టిక = గుడ్డపేలిక **43** ప

**159** చూఁడుచున్ = దహించుచు **44** ప
గగుర్పొడిచిన మేను మేఘమువలెను, జ్వాలాజాలముగలవాలము మెఱుపువలెను ఉండెనని (**45** ప)

**160** సీత యగ్నిం బ్రార్థించుట (**53** ప)

**161** ప్రాలేయనగము = మంచుకొండ (**53** ప)
తోరణము = పురద్వారము (**57** ప)
పరిఘము = గద (పరిఘ = అగడ్త)
క్రవ్య+అద=మాంసభక్షక (**60** ప)
నెగనెఱిగ నెఁ-ఆదిహల్లోపము (**62** ప)

---

## 13 విభీషణు విషాదము

[రావణుఁడు యుద్ధభూమిం జచ్చి పడియుండ, సోదరప్రేమచే విభీషణునకుఁ గల్గినవిషాదముచే రావణుని గుణదోషము లుగ్గడింపఁబడినవి]

**163** సైఁపన్ - తత్సమరూ॥ సహింపన్ (1 ప)

మున్ను మహాయుద్ధములలో భుజాబలము గనఁబఱచిన నీవు నేఁడు చేతులు తెగఁ గొట్టఁబడి నేలఁ గూలితివా?

164 దేవలక్ష్మిని కొప్పుపట్టి యీడ్చినవి, యుద్ధములలో నానినవి, వెండి కొండ నెత్తినవి, దిగ్గజములదంతముల నూడఁ బెఱికినవి, ఇట్టివి చేతులు (3 ప)

165 సూర్యుఁడు నేలఁబడెను, చంద్రుఁడు చీఁకటిలో మునిఁగెను, అగ్ని చల్లఁబడెను, మేరువు ఒరఁగి పోయెను రావణుచావిట్టిదని

166 రూపకాలంకారము (12 ప)

బలమైన మూఁపులను మ్రాను, కలది, శౌర్యమను వేళ్లు కలది, భుజములను కొమ్మలు కలది, అనివార్యమైన ధైర్యమను చిగుళ్లు కలది, పెచ్చు పెరుఁగు కోప మను పువ్వులు కలది, పాపకార్యము లను ఫలములు కలది, యగు రావణుఁడను చెట్టును రాముఁ డను గజము విఱిచెను

కర దుర్జయము=చేదోయి యను దంతములచే జయింప రానిది; గర్వమనుమదముచే కన్ను గాననిది, ఘోర క్రమము=క్రూరచాప ధరులగువారి చేతులకు పట్టరానిస్థితికలది(గజరాజు), (క్రూరములయిన విండ్లను ధరించిన చేతులయొక్క సహింపరానివిధము కలవాఁడు-రావణుఁడు) (ప 13)

పద్మజ వంశసముద్భవంబు=బ్రహ్మవంశమునఁ బుట్టినవాఁడు (రావణుఁడు), శ్రేష్ఠమయిన జాతిలోఁ బుట్టినది (ఏనుఁగు),
నిర్జర తరుల—దేవత లనెడు చెట్లగుంపును విఱుచుటచే గొప్పది

దైత్యరాజ సింధురపతి=రావణుఁ డనెడి యేనుఁగు. బాణదంష్ట్రిమై=బాణములను దంతములు కలదియై

సాంద్రపరాక్రమ మను ధూమంబు, ఊపిరి యను పొగ, సాహస మ
కట్టెలు, ప్రతాపమను ప్రతాపము, కల, రావణుఁ డనెడి యగ్ని
రాముఁడను మేఘము చల్లార్చెను (ప 14)

---

## 14 బలరామ ప్రజాగమనము

[జరాసంధు నోర్చిన వెనుక, బలరాముఁడు కృష్ణానుమతిని వ్రేప
కుఁ బోవుట ఎంతటివారికిని జన్మస్థానము మీఁది ప్రేమ పోయుండి. తీఱున

168 కడలుకొనఁగ = అతిశయింపఁగా 1

ఆలోకము = ఆలోకనము = చూచుట

వ్రే = గొల్ల, స్త్రీ॥ వ్రేత పుం॥ వ్రేఁడు 2

తీపారెడు చూడ్కి (తీపు+ఆరు)=మనోజ్ఞమగు చూపు ఆ+పోవని
తృప్తి తీఱని (ఆదట + పోవని)

168 స్వాగతమే = సుఖమైన రాక యా? (సుఖముగ వచ్చితిరా?) 6

దేశభక్తిని వెల్లడించు పద్యము 7

రామకృష్ణులు చేసిన విరకృత్యములు 8

169- బలరాముని వినయము, కృతజ్ఞత 10

మాకిచ్చటి విన్నానాఁటి పనులు మఱపురాకయుండుటచే, రాజ్యలక్ష్మి
మీఁద సహితము మాకంత మనసు పోవుట లేదు 11

రామి—వచ్చు ధా॥ వ్యతి॥ భావార్థకము, క్రియా విశేష్యవ
రామిఁగ-తృతీయార్థమున ద్వితీయ

170 అంత్యప్రాసము 12

వివిక్తము=విజనము, రహస్యస్థలము

కోర=గిన్నె 13

శీధువు = కల్లపుఁగల్లు

ఉగ్గడువు = మిక్కిలి యధికము